# భారతదేశము

## శ్రీ వివేకానందస్వామి


అనువాదము :

శ్రీ గడ్డం చెన్నప్ప నాయుడు, బి. ఏ. (ఆనర్సు)

ఆంధ్రభాషాశాఖ,

కావలి క[illegible] కావలి.








శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు :: మద్రాసు – 4

# తొలిపలుకు

భారతదేశమునుగూర్చి వివేకానందులకు గల పరిజ్ఞానమే కొద్ది మందికోగాని లేదు. భారతదేశమును వారు ప్రేమించినంత గాఢముగ నెంతోమంది ప్రేమించియుండరని నిర్భయముగఁ జెప్పవచ్చును. ఒకప్పుడు వారిట్లు చెప్పిరి: "మీరేదో దేశభక్తినిగూర్చి మాటాడుచున్నారు, కాని మీలో నా భావము గాఢముగ నుండి కంటికి కూర్కు లేక ప్రతి నిమిషము ప్రజల దుఃఖమును మీ దుఃఖముగా భావించుచున్నారా? అదియే నిజమైన దేశభక్తి." వివేకానందుల జీవిత చరిత్రను దెలిసిన వారు వారిలో నిట్టి దేశభక్తి గలదని తప్పక గ్రహించియుందురు.

మనదేశము నెక్కువ ప్రేమించుచు పరోపకారపరాయణులై ఆత్మత్యాగము చేయుటకైనను సిద్ధముగనున్నవారు కొద్దిమందియున్నారు. కాని దురదృష్టవశాత్తు వారికి దేశమునుగూర్చిన పరిజ్ఞానము చాల తక్కువ. సత్యభారతవర్షమేదో వారికి తెలియదు. స్వదేశీయ వాతావరణములో వారు లేరు. సత్యభారతవర్షమును దెలిసికొనుటకు ముందుగ దాని ప్రాచీనసంస్కృతిని తెలిసికొనవలయును. అందలి ప్రజలగూర్చి బాగుగ దెలిసికొని వారి సుఖదుఃఖములు, భావములు, ఆదర్శములు, దైనికసమస్యలు మున్నగువానితోఁ దాదాత్మ్యము పొందవలయును. ఈ దృష్టితోఁ జూచినచో స్వాములవారిని బోలినవారు లేరనవచ్చును. బహుగ్రంథపఠనముచేతను, దీర్ఘయోచనచేతను, సమగ్రవిషయపరిశీలనముచేతను వీరి మేధ కుశాగ్రమై మన సాంస్కృతిక వారసత్వమును బాగుగ గ్రహించుటయే గాక వీరిలో భారతీయాధ్యాత్మికసత్యము లనుభవములోనికి వచ్చియుండెను. వీరు దేశభక్తి, సన్న్యాసములు కరుడుగట్టినముద్ద. అంతేగాక వీరు దేశము నలుమూలలు తిరిగి యుత్తమా

ధములను, రాజులను, పేదలను, విద్యావంతులను, విద్యాహీనులను కలిసికొనుచు నేటి పతనావస్థయందుసైతము ప్రాచీన భారతీయ హృదయ చలనమున్నట్లును, అనుకూలవాతావరణ మేర్పడినంతనే తిరిగి ప్రజ్వరిల్లుటకు సిద్ధముగ భారతదేశమున దివ్యాగ్ని గుప్తముగ దాగియున్నట్లును గ్రహించిరి. అందుచే భారత దేశమును గూర్చి మాటాడుటకు, దాని యభివృద్ధికై పాటుపడుచున్నవారికి సలహాలిచ్చుటకు స్వాములవారే తగినవారు. భారతదేశమునుగూర్చి స్వాములవారు వ్రాసిన కొన్ని వ్యాసము లీ గ్రంథమున నీయఁబడినవి. భారతదేశము తనచరిత్రలో నొక క్రొత్తయుగమున నడుగిడి పురోగమించుటకు ప్రయత్నించుచున్న యీ సమయమున వీని ప్రయోజన మెంతేని యుండఁగలదు.

ఈ వ్యాసముల సేకరించి 'ఇండియా' అను పేరుతో నాంగ్లమున నద్వైతాశ్రమ్ (మాయావతి, ఆల్మోరా) వారు పుస్తకరూపమునఁ బ్రకటించియున్నారు. దీనిని తెనిఁగించి యాంధ్రపాఠకలోకమున కందఁ జేయవలయునను మా యుద్దేశ్యమును కావలి కళాశాలలో నాంధ్రభాషా శాఖాధ్యక్షులుగ నున్న శ్రీ శ్రీరాం వేంకటభుజంగరాయశర్మగారికి తెలిపితిమి. వారు సరే యని, యనువదించు కార్యము తమశిష్యులును, నిప్పుడు సహాధ్యాపకవర్గములోనివారునగు శ్రీ గడ్డం చెన్నప్పనాయుఁడు గారి కప్పఁజెప్పుఁడనిరి. మా ప్రార్థన నంగీకరించి శ్రీ నాయుఁడుగారీ గ్రంథము ననువదించి యిచ్చిరి. అందులకు వారికిని, వారిపేరును సూచించిన శ్రీ శర్మగారికిని మేము కృతజ్ఞులము.

శ్రీరామకృష్ణమఠము,<br>మైలాపూరు, మద్రాసు-4<br>15-8-1958

ప్రకాశకులు

# విషయసూచిక

# ప్రపంచమునకు భారతదేశ మీయఁగల సందేశము

శ్రీమద్వివేకానందస్వాములవారి స్వహస్తలిఖితమగు ప్రతులనుండి యీ క్రింది విషయములు సేకరింపఁబడినవి. వారొక పుస్తకము వ్రాయనుద్దేశించి యందుకై నలుబది రెండంశములుగల యొక ప్రణాళికను దయారుచేసిరి. కాని వానిలోఁ గొన్ని యంశములఁ గూర్చియే యుపోద్ఘాతరూపమునఁ జర్చించిరి. పుస్తకము పూర్తి కాలేదు. మేము వ్రాతప్రతుల నుండి సేకరించినవాని నట్లే క్రిందఁ జూపుచున్నాము.

## ప్రణాళిక

1. పాశ్చాత్యులకు నే నొసఁగిన సందేశము సాహసోపేతమైనది. స్వదేశీయుల కిచ్చిన సందేశ మంతకంటెను సాహసముతోఁ గూడినది.
2. మహనీయమగు పాశ్చాత్యదేశములలోని నాలుగు వర్షముల నా నివాసము భారతదేశమును బాగుగా నర్థము చేసికొనుటకుఁ దోడ్పడినది. తచ్ఛాయలు గాఢములు; కాంతులు దీప్తిమంతములు.

3. భారతీయు లధఃపతితు లైనారను వాదము సత్యదూర మైనది.
4. వివిధజాతులమధ్య సమైక్యసమస్య అన్ని దేశములలో వలె భారతదేశమునను నుండినది. కాని ఆ సమస్య కిచ్చుటనున్న విస్తృతి మతేదేశమునను లేదు.
5. భాష, ప్రభుత్వము,అంతకంటెను మతము—వీనిలోఁ గల సాదృశ్యలక్షణములు సమైక్యసాధనశక్తులుగ నుండినవి.
6. ఇతరదేశములలో నీ సమైక్యము బలప్రయోగముచే జరిగినది; ఒకజాతి సంస్కృతి ఇతరజాతుల నెత్తిపై రుద్దఁబడినది. తత్ఫలితముగ నల్పాయుస్సుగల శక్తిమంత మగు జాతీయజీవన మేర్పడినది; తరువాత నామ రూపములు లేక నశించినది.
7. భారతదేశమున నీ సమస్య కెంత విస్తృతిగలదో పరిష్కారప్రయత్నమంత సౌమనస్యముతో నుండినది. అనాదికాలమునుండియు వివిధజాతుల యాచార వ్యవహారములు, ముఖ్యముగా మతములు సహాన భావముతోఁ జూడఁబడినవి.
8. సమస్య చిన్నదై బలప్రయోగమె ఐక్యసాధనమై నపుడు బలవత్తరజాతితప్ప నితరజాతుల విలక్షణ ములలోని శక్తులన్నియు నిర్మూలముచేయఁబడినవి.

అల్పసంఖ్యాకులగు నొకవర్గమువారే అధికసంఖ్యాకులను స్వప్రయోగమున కుపయోగించుకొనిరి; అందుచే నధికసంఖ్యాకు లభివృద్ధి చెందు నవకాశము శూన్యమైనది. తత్ఫలితముగ బలవత్తరజాతిశక్తులుడిగినపుడంతవఱకు సర్వాంగసుందరముగ నగుపడుచుండిన వారి జాతీయజీవనసౌధము విచ్ఛేదమైనది. గ్రీసు, రోము మొదలగున వీందుల కుదాహరణములు.

9. సామాన్యభాష యొకటి వాంఛనీయమె. కాని పై విమర్శయే దీనికిని వర్తించును. వివిధభాషలలోని సహజశక్తులంతరించును.

10. ఇతరభాషలన్నియుఁ దద్వికృతులని చెప్పఁదగిన పవిత్రమైన భాష యొక్కటి యుండుటయె భాషాసమస్యకుఁ బరిష్కారమార్గము. సంస్కృత మట్టి సాధనమై యున్నది.

11. ద్రావిడభాషలు పుట్టుకతో సాంస్కృతికములు కావచ్చు; కాకపోవచ్చు. కాని నిత్యవ్యవహారమున నేఁ డవి సంస్కృతమునకు దగ్గఱివై యున్నవి. దిన దినమునకు నవి మఱింత చేరువకు వచ్చుచున్నవి. కాని తమ విలక్షణముల నట్లె నిలుపుకొన్నవి.

12. ఆర్యజాతి భారతదేశములోని యన్నిజాతులకు మూలమని గ్రహింపఁబడినది.

13. ఆర్యులను ప్రత్యేకజాతి మధ్యాసియా, బాల్టిక్ సముద్రతీరమధ్యప్రాంతమున నివసించెననుట యూహా మాత్రమే.
14. జాతు లెప్పుడును సమ్మిళితములు. ప్రత్యేకించుట నామమాత్రమే.
15. శ్వేతజాతులు – శ్వేతేతరములు.
16. చరిత్ర నటుంచి యింగితజ్ఞానముతోఁ జూచిన ఆర్యులు టర్కీ, పంజాబు, పశ్చిమోత్తర టిబెట్టుల మధ్యభూమియందు నివసించినట్లు తెలియును.
17. భాషలకు మూలము సంస్కృతము, జాతులకు మూలము ఆర్యులు నై యుండుట విభిన్న సంస్కృతులు గల జాతుల, తెగలమధ్య నైక్యతకుఁ దోడ్పడినవి.
18. భాష, జాతుల సమస్యలకు సంస్కృతము, ఆర్యులు పరిష్కారమార్గములైనట్లే బ్రాహ్మణత్వము బహుముఖాభివృద్ధికి, సంస్కృతికి కారణమగుటయేగాక సాంఘిక, రాజకీయ సమస్యలకును పరిష్కారమార్గమైనది.
19. భారతదేశపరమాదర్శము – బ్రాహ్మణ్యము.
20. ధనరహితము, స్వార్థరహితము, నీతికిఁదప్ప మఱే శాసనములకుఁగాని, రాజుకుఁగాని లోఁబడకుండుట.
21. వారసత్వమువలన బ్రాహ్మణత్వము —— నేఁడువలె

గతమునందును అనేకజాతులు ప్రయత్నించి యీ హక్కును బొందినవి.

22. సాహసకృత్యములు చేసినవారు స్వోత్కర్షనుగూర్చి చెప్పుకొనలేదు. బలహీనులు, మూర్ఖులునగు సోమరి పోతులే అట్టిపని చేసిరి.

23. బ్రాహ్మణత్వ, క్షాత్రముల క్షీణత. కలియుగమున బ్రాహ్మణేతరులే యుందురని పురాణములు చెప్పినవి. ఆ మాట సత్యమే. కాని కొద్దిమంది బ్రాహ్మణు లింకను నున్నారు. అదియు నొక్క భారతదేశమున మాత్రమే.

24. క్షాత్రము నధిగమించి బ్రాహ్మణత్వమును పొంద వలెను. పూర్వము కొంద ఱట్లు చేసిరి. నేఁడును నది కర్తవ్యమై యున్నది.

25. దీనికంతకు మతము సమన్వయకారి కావలయును.

26. బాబిలోనియనులు 'బెల్స్'ను, హెబ్ర్యూలు 'మోలాక్స్'ను పూజించినట్లు ఒకజాతిలోని వివిధ తెగలవారు సామాన్యనామముగల ఒకే దేవతను బూజించిరి.

27. 'బెల్స్' అను పేరు లేకుండ 'బెల్ మెరొడాక్' అను ఒక దేవతగా వ్యవహరింపవలయునని బాబిలోని యాలో జరిగిన ప్రయత్నము — వివిధములగు

'మోలాక్స్' లేకుండ 'మోలాక్ యూవా' (లేక యూహు)అను ఒక దేవతగా వ్యవహరింప హెబ్రూ్యలు చేసిన కృషి.

28. పర్షియనులు బాబిలోనియనులను నాశము చేసిరి, బాబిలోనియను పురాణములఁ దీసికొని తమకనుగుణ ముగ ననువర్తించుకొన్న హెబ్రూ్యలు ఏకేశ్వరో పాసనము ప్రధానముగాఁగల మతమును నిర్మించిరి.

29. నియంతృత్వవిధానమునందువలె నేకేశ్వరతత్త్వము నందును శక్తి కేంద్రీకృతమై యుండును. కార్యనిర్వ హణము త్వరగా నగును. కాని దాని అవధి పరిమితమై యుండును. క్రౌర్యము, హింస అను చెడుగుణ ములిందుఁ గలవు. ఈ ప్రాబల్యమునకు లోనైన దేశములు తాటాకుమంటవలెఁ గొలఁదికాలము ప్రజ్వరిల్లి నామరూపములు లేక నశించినవి.

30. భారతదేశమునను నట్టిసమస్య తలయెత్తినది. 'ఏకం సద్విప్రా బహుధా వదన్తి' యనుటలోఁ బరిష్కార మార్గ మేర్పడినది.
ఏదైనను విజయవంతమైనచో నది పై పరిష్కార మార్గమువలననే.

31. తత్ఫలితము వేదాంతిలో నద్భుతమగు సహనభావ మేర్పడుట.

32. వివధశక్తుల వ్యక్తిత్వమును నాశముచేయక వాని నేకీకరణము చేయుటయే బృహత్ సమస్య.

33. వ్యక్తులపై — లౌకికులు, నలౌకికులునగు వారెవరైననుసరె — నాధారపడిన నెట్టి మతమైనను నాపని చేయఁజాలదు.

34. భారతదేశముననే వ్యక్తినిగాక సూత్రమును బోధించు అద్వైత సిద్ధాంత మహాత్వమున్నది. లౌకికులు, నలౌకికులునగు వ్యక్తులకును నందుఁ దమ పాత్ర లేకపోలేదు.

35. ప్రతియుగమున నిట్టిది జరుగుచునేయున్నది. ఈవిషయమున మన మెప్పుడును పురోగాములగుచునే యున్నాము — మహామ్మదీయుల యుగమునఁగల ప్రవక్తలు.

36. ఇది పూర్వము జాగృతము, శక్తిమంతమునై యుండెను. ఇప్పు డంతగాలేదు. ఈ దృష్టిలో మన మధః పతితుల మైనాము.

37. భవిష్యత్తునందిట్లు కానున్నది. ఒక జాతి శక్తి ప్రాబల్యము లితరులను స్వోపయోగమున కుపయోగించుకొని కొద్దికాలమే మనఁగలిగి యద్భుత ఫలితముల నిచ్చినచో నిచట భారతదేశమున క్రమముగఁ దప్పని

సరిగ నన్ని జాతులు రక్తమునందు నాదర్శము లందు నొకటియై ఒకే లక్ష్యమువైపు తమదృష్టిని కేంద్రీకరింపనున్నవి. అట్టి భవిష్య ద్రూపము నా మనోనేత్రమునకుఁ గన్పట్టు చున్నది. ఆ భారతదేశము ప్రపంచమునఁగల యన్ని దేశము లలో నూతనముగ, శక్తిమంతమైనదియేగాక ప్రాచీనమునై యుండఁగలదు.

38. అందులకు మార్గము నన్వేషించవలయును. శ్రుతుల వలనఁ గాక స్మృతులవలన నేర్పడిన కొన్ని సాంఘి కాచారము లీకార్యమున కంతరాయములై యున్నవి. కాలానుగుణముగ స్మృతులు మారవలయును. ఇది లోకవిదిత సత్యము.

39. వేదాంతసూత్రముల స్వదేశముననేగాక విదేశములం దును ప్రచారము చేయవలసియున్నది. వ్రాఁతల మూలమునఁగాక వ్యక్తులమూలమున మన సిద్ధాంత ములు ప్రతిజాతి హృదయమును దాఁకవలయును.

40. కలియుగమున దానమే ముఖ్యకర్మము. కర్మచే క్షాళిత కల్మషుఁడుగానిదే జ్ఞానసముపార్జనము చేయ లేఁడు.

41. భౌతికాధ్యాత్మిక జ్ఞాన దానము.

42. త్యాగము, త్యాగమూర్తులు—దేశమున కవసరము.

# ఉపోద్ఘాతము

ప్రియతములగు స్వదేశీయులారా! పాశ్చాత్యులకు నా యిచ్చిన సందేశము సాహసోపేతమైనది. మీా కంతకంటెను ధైర్యముతో సందేశమిచ్చుచున్నాను. అధునాతన పాశ్చాత్య దేశములకు ప్రాచీన భారతదేశ సందేశము నందంజేయుటకు నా సాయశక్తు లుపయోగించితిని. తత్కార్య నిర్వాహణము సత్పథమును ద్రొక్కినదో పెడత్రోవం బట్టినదో భవిష్యత్తు నిర్ధారింపవలసియున్నది. కాని అట్టి భవిష్యద్వాణి స్పష్టముగను, మృదువుగను ఒక సందేశమును — భవిష్యద్భారతదేశము వర్తమాన భారతదేశమునకుం బంపుచున్న సందేశమును — వాకొనుచునేయున్నది. కాలము గడచిన కొలంది ఆ సందేశమునకు జీవశక్తి ఎక్కువగుచున్నది.

నేను వివిధజాతుల ఆచార వ్యవహారములందును, శక్తులందును గల తారతమ్యములంజూచి పరిశీలించు నవకాశము గలుగుట నా అదృష్టమనియే చెప్పవచ్చును. విభిన్నములై కన్పట్టు నా ఆచారవ్యవహారములలో, సంస్కృతి శక్తులలో సుఖదుఃఖాది ద్వంద్వములలో సమానముగ స్పందించు మానవహృదయము కన్పట్టుట యాశ్చర్యకరమైన విషయము.

మంచిచెడ్డలు సమానస్థాయిలో నెల్లయెడలనున్నవి. అంతియేగాక అత్యద్భుతమగు మానవాత్మయు సర్వత్ర

నున్నది. ఆయాత్మ సమానస్పందనముగల ప్రతి ఆత్మను నర్థముచేసికొనఁగలదు. 'ప్రతి దేశమున బ్రాహ్మణులు, శ్రమణులు నున్నారు' అను నశోకుని మాటలకు సాక్ష్యములై ప్రతిజాతియందును మానవజాతికే తలమానికము లనఁదగిన స్త్రీ పురుషు లున్నారు.

నిష్కల్మషము, నిస్స్వార్థమునగు ఆత్మలు మాత్రమే చూపఁగల, ప్రేమతో హృదయపూర్వకముగ నాకు స్వాగత మిచ్చిన పాశ్చాత్య దేశములకు నేను కృతజ్ఞుఁడను. కాని నా మాతృభూమికి నా ప్రాణములనే అంకిత మిచ్చుచున్నాను. నేనొక్కసారిగ పెక్కు జీవితములనే గడుపఁగలిగినచో ప్రతి జీవితములోని అనుక్షణము మీ సేవకే ధారవోయఁగలను.

ఏలన నాకుఁగల శారీరక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులు ఈ మాతృభూమివలననే నాకు సంక్రమించినవి. నేను దేనిలోఁగాని కృతార్థుఁడనై నానన్నచో ఆ ప్రఖ్యాతి మీదే; నాది కాదు. ఈభూమిలోఁ బుట్టు ప్రతివ్యక్తిని కొన్ని ముఖ్య ప్రబోధము లావరించియుండును. అట్టివాని వలన లాభము పొందమిచే నావలన శక్తిలోపముగాని, అపజయముగాని జరిగి యుండిన వానికి మాత్రమే నేను బాధ్యుఁడను.

ఆహా! మనదేశమెంత యద్భుతమైనది! విదేశీయుఁడైనను, స్వదేశీయుఁడైనను ఈభూమిపై నడుగిడిన యంతనే

—అతని యాత్మ పశుస్థితికి పతనముగాకుండినచో—ఇతరు
కందని అనాదికాలమునుండియు పశుప్రాయులను అమానుష
వ్యక్తులయొక్కయు, దేవతలయొక్కయు స్థితికిఁ దెచ్చుటకు
కృషి సల్పిన ఉత్తమపురుషులఁగూర్చిన యాలోచనలచే
సంచలితుఁడు కాకమానఁడు. ఇచ్చట వాతావరణముసైతము
ఆధ్యాత్మవాసనా మిళితమే. వేదాంత నీత్యధ్యాత్మశాస్త్ర
ముల కిది పవిత్రభూమి. పశుస్థితినుండి తప్పించుకొనుటకు
మానవుఁడుచేసిన కృషి సఫలమైన దిచ్చటనే. అజ్ఞానాంధ
కారమును జీల్చుకొని ఆదిమధ్యాంతరహితమగు విశు
ద్ధాత్మ వెలువడునట్లుచేయఁగల శిక్షణ కీభూమియే స్థానము.
ఇచ్చటె మానవుఁడు మొట్టమొదటిసారిగా నంతయు మిథ్య
యని కనుఁగొనువఱ కీ దేశమున సుఖము, దానికంటెను
దుఃఖము నెక్కువగ నుండెను. యౌవనము, భోగము, ఐశ్వ
ర్యము, అధికారము అన్నియు భ్రమయని తలఁచి వాని కతీ
తుఁడుగా నుండుటకు మానవుఁడు మొదట ప్రయత్నించిన
దిచ్చటనే. కష్టసుఖములు, బలాబలములు, కలిమిలేములు,
చావుబ్రతుకులు—ఇత్యాది ద్వంద్వముల కెక్కువ గుఱియైన
యిచ్చటి మానవులలోనే యత్యుదాత్తమగు త్యాగబుద్ధి
వెలువడినది. చావుబ్రతుకులు, జీవితాశ, దానికొఱకుఁ జేసిన
వ్యర్థప్రయాసలవలనఁ గలుగు నష్టములు మొదలగు సమస్య
లకు నింతకుముందుఁగాని యిఁకమీఁదటఁగాని లేని పరిష్కార

మార్గ మేర్పడిన దిచ్చటనే. సత్యమగు వేఱొక పదార్థ ఛాయామాత్రమగు జన్మముగూడ కర్మఫలమేయని యిచ్చట మాత్రమే గ్రహించుట దీని కంతకు కారణము. ఇచ్చట మాత్రమే మతము ఆచరణీయము, సత్యబద్ధమునై యున్నది. బలహీనులగు సోదరమానవుల దోఁచి జీవితసుఖముల ననుభవించుటకు నితరదేశములలో స్త్రీ పురుషు లెగబడిన ట్లిచ్చటి స్త్రీ పురుషులు ధైర్యముతో లక్ష్యమును – మోక్షమును సాధించుటకుఁ బ్రయత్నించిరి. పిపీలికాదిబ్రహ్మపర్యంతముగల ఆత్మయొక్కటేయని గ్రహించు హృదయవైశాల్య మిందే గలదు. బ్రహ్మ మొదలు ఇసుకకణమువఱకు నుత్తమాధమ భేదము లేక మానవహృదయమును జూఱఁగొన్న దిచ్చటనే. ప్రపంచ మఖండమని దానిలోని ప్రతిస్పందనమును తన యాత్మస్పందనమేయని మానవుఁడు గుర్తించిన దిచ్చటనే.

హిందూదేశము పతనావస్థయందున్నదని నేఁడుమనము వినుచున్నాము. ఆ మాటను నేను విశ్వసించిన దినములు లేకపోలేదు. కాని ఇతర దేశ నిజస్థితులు తెలిసికొని అనుభవముగడించిన తరువాత నేను పొరపడితినని వినయముతో విన్నవించుచున్నాను. ఆర్యులనివాసమగు నో పవిత్రభరత మాతా! నీకు పతనమెప్పుడును లేదు. రాజులు మారిరి; రాజ్యాధికారములు మారినవి. కాని భారతదేశమున రాజుల

యొక్కయు, వారి యాస్థానములయొక్కయు ప్రాబల్యము కొంతమందికే పరిమితమైనది. అధికప్రజానీకము ఉచ్ఛనీచ దశల పొందుచు నొకప్పుడు విజృంభించియు, నొకప్పుడు మందగించియునున్న తనజాతీయ జీవనము నెట్టి యంతరాయము లేక గడిపినది. మానుషామానుష శక్తులేవియు నిలుపలేని యుదాత్తగతితో నా మాతృభూమి పశుప్రాయుఁడగు మానవుఁడు దేవతాపురుషుఁడుగ పునరుజ్జీవనము నొందఁగల గమ్యమునకై పురోగమించుచున్నది. ఈ గతిలో నెడ నెడ నంతరాయములు గలుగకపోలేదు. కాని వానిచే నీగతి నిలుచుటకు బదులుగ ద్విగుణీకృత వేగవంతమైనది.

సోదరులారా! మన లక్ష్యమెంత యుదాత్తమైనదో చూడుఁడు. ఉపనిషత్కాలముననే మనము "నధనేన న ప్రజయా త్యాగేనైకే అమృతత్వమానశుః" (ధనముచే, వంశగౌరవముచేఁగాక త్యాగముచేతనే దేవత్వము సిద్ధించును) అని ప్రపంచమునకుఁ జాటి చెప్పినాము. తృష్ణాధీనమై జాతి తరువాత జాతి ప్రపంచసమస్యను పరిష్కరించుటకై సాయశక్తుల కృషిచేసినది. కాని వారందఱును విఫలులైరి. కామకాంచనములమీఁదివ్యామోహామువలనఁగలిగిన క్రౌర్యదుఃఖములచే ప్రాచీనయత్నములు మటుమాయమైనవి. క్రొత్తవానికిఁగూడ అదే అవస్థ కలుగుచున్నది. శాంతియుద్ధ

ములు, సహనాసహనములు, మంచిచెడ్డలు, భౌతికాధ్యాత్మిక ములు—వీనిలో నేది నిలువఁగలదని యింకను తేల్చవలసి యున్నది. ఇక మనమన్ననో కొన్నియుగములకు పూర్వమే సమస్యకు పరిష్కారమార్గమునుగనుగొని కష్టసుఖములమధ్య ఆ మార్గమునే యనుసరించితిమి; ప్రళయసమయమువఱకుఁ గూడ ననుసరింపఁగలము. మనపరిష్కారమార్గము ఐహిక భోగవాంఛ కాదు—త్యాగము, సన్న్యాసము.

మానవజాతిని ఆధ్యాత్మపరాయణులఁగావించుటయే భారతీయ జీవనసిద్ధాంతము; దాని ఆస్తికతకు పునాది. టార్టారులు, టర్కులు, మొఘలులు, ఆంగ్లేయులు—ఎవరు పాలించినను భారతదేశ మీ పథమును, ఈ లక్ష్యమును వదల లేదు. తన ఆధ్యాత్మికతచే ప్రపంచమునంతయు సంచలింపఁ జేయఁగల మహావ్యక్తి భారతదేశమున లేని సమయమును చూపుమని నే నెవరితోనైనను సవాలుచేయఁగలను. భారత దేశ కర్తవ్య మధ్యాత్మసంబంధమైనది. ఆపని యుద్ధభేరీ కాహళధ్వనులచేతను, సైనికవిన్యాసముచేతను సాధింపఁబడు నదిగాదు. భారతదేశ ప్రభావము హేమంతమందలి మృదువగు మంచువలె ప్రపంచమంతయు వ్యాపించినది. దాని చిహ్నములు స్పష్టాస్పష్టములైనను ఫలితములు మాత్రము చిరస్థాయిగలవియె. ఈ ప్రభావము సహజముగ

మృదుస్వభావము కలదగుటచే విదేశములలో వ్యాప్తి చెందుటకు అనుకూల వాతావరణమునకై వేచియుండవలయును. స్వదేశమున తత్ప్రభావ మెప్పుడును నున్నది. విద్యావంతుఁడగు ప్రతి వ్యక్తియు నొక్క విషయమును గ్రహించియుండును. సామ్రాజ్యపిపాసులగు టార్టారులు, పర్షియనులు, గ్రీకులు, అరబ్బులు మొదలగువారిచే భారతదేశమునకు బయటి ప్రపంచముతో సంబంధమేర్పడినపుడు ఇచట బయల్వెడలిన ఆధ్యాత్మిక ప్రభావమను ప్రవాహము ప్రపంచమును ముంచియెత్తినది. అట్టి వాతావరణమే నేఁడు మఱియొక పర్యాయమేర్పడినది. ఆంగ్లేయ జల భూమార్గములు, ఆ చిన్న ద్వీపమున నుద్గతమైన శక్తులు భారతదేశము నితర ప్రపంచమునకు సన్నిహితము చేసినవి. అట్టి ఫలితమే మఱల బీజరూపమునఁ గన్పట్టుచున్నది. ఇది మొదటి దశయనియు, ఆ బీజము పెద్దదై పుష్పఫలభరితమగు దినములు ముందున్నవనియు గుర్తుంచుకొనుఁడు. ఇది ఏ రూపమున నుండునో చెప్పలేను. కాని ఒక్కటిమాత్రము సత్యము. నాగరికమగు ప్రతిదేశములోని లక్షలాది ప్రజలు ధనదాస్యము మూలముగ నేర్పడిన భౌతికవాదమను ఆఘాతమునుండి తమ్ము రక్షింపఁగల సందేశమునకై ఎదురుచూచుచున్నారు. నూతన సాంఘికోద్యమకర్తలు తమ ఉద్దేశ్యములకు ఆధ్యాత్మవాసన నియ్యఁగలది ఉదాత్తమగు నొక్క వేదాంతమతమే యని

అప్పుడే గ్రహించినారు. ఈ విషయమునుగూర్చి నేను చివరఁ జర్చింపవలసియున్నది. కావున దేశమున నాంతరంగికముగా నేమి జరుగుచున్నదో దానిని గూర్చి యిపుడు చర్చింతును.

ఈ సందర్భమున దేశములోని వివిధశక్తుల ఆధ్యాత్మీకరణమునుగూర్చియే కాక ఏకీకరణమును గూర్చియుఁ జెప్పవలసియున్నది. ఇందు వివిధజాతుల సమీకరణము ప్రతిదేశమునకు సాధారణ సమస్యగానున్నది.

# భారతీయుల ఆధ్యాత్మికచింతనము.

## (అమెరికాసంయుక్తరాష్ట్రములో బ్రూక్లిన్‌నగరమున బ్రూక్లిన్‌నైతికసంఘ మేర్పాటుచేసిన సమావేశమున నిచ్చిన యుపన్యాసము)

హిందూదేశము వైశాల్యమున అమెరికాసంయుక్త రాష్ట్రములలో సగమయ్యు నిరువదికోట్లకుఁ బైఁబడిన జన సంఖ్యగలిగి యున్నది. అచ్చటి జనులు ఇస్లాము, బౌద్ధ (జైనముతోసహా) హిందూమతముల నవలంబించియున్నారు. అందులో నాలుకోట్ల మహమ్మదీయులు, తొంబదిలక్షుల బౌద్ధులు, ఇరువదికోట్ల అరువదిలక్షుల హిందువులు గలరు. ఈ విశ్వమనంతము, అనశ్వరము, సువిశాలమునని చాటు వేదములలోఁ జెప్పఁబడిన నైతికబోధలు, ధ్యానచింతన వేదాంతము లాధారముగ హిందూమత ప్రధాన సిద్ధాంతము లేర్పడినవి. ఈ ప్రపంచమున కాదిలేదు; అంతమునుండఁ బోదు. ఆధిభౌతికమున నాధ్యాత్మశక్తి స్వరూపములనంత ములు. అనంతాత్మ స్వయంవ్యక్తము, అనశ్వరము, అవి కారము. శాశ్వతత్వరంగమున కాలగమన చిహ్నము లేవియుఁగనపట్టవు. మానవబుద్ధి కగోచరమగు నతీంద్రియ స్థానమున భూతభవిష్యత్కాలములు లేవు. మానవాత్మకు

నాశములేదని వేదములు బోధించును. శరీరము వృద్ధి క్షయ ములకు లోనగుచున్నది. పెరిగెడి ప్రతివస్తువు విరుగవలసి నదే. శరీరాంతర్గతమగు నాత్మ అనంతము శాశ్వతమునగు జీవనముగలది. దాని కాద్యంతములులేవు. క్రైస్తవమతము మానవాత్మకు ఆదికలదని బోధించును. హిందూమతము భగవంతుని చిన్మయరూపమే మానవాత్మయనియు భగవం తునికివలె దీనికిని నాదిలేదనియు బోధించును. ఇది క్రైస్తవ హిందూమతములలోని ప్రధానభేదములలోనొకటి. మాన వాత్మ ఒక దేహమునుజాలించి యింకొకదేహమును ప్రవే శించుచు, పురోగతినొందుచు, పవిత్రీభూతమై అవికారమగు ననంతాత్మలో లీనమగువఱకు వివిధరూపముల, ప్రకృతుల, దశల పొందును.

అట్లైనచో మనకు పూర్వజన్మముల స్మృతి లేకపోవు టకు కారణమేమి? అను ప్రశ్న కలుగవచ్చును. ఇందుకు మనజవాబిది: స్మృతియనునది మానసిక బహిరావరణము మాత్రమే. దానిలోపల మనయనుభవములు, సుఖదుఃఖాను భూతులు నిక్షిప్తమైయున్నవి. మానవాత్మ నిత్యమగుదానిని కనుఁగొనుటకు వాంఛించును. మన మనస్సు, శరీరము— పాంచభౌతికమగు ప్రతిదియు — తప్పక మార్పుచెందును. మన ఆత్మ పవిత్రము, అవికారమునగు దానిని దెలిసికొన వలయునను నుదాత్తాశయముగలది. అందుచేతనే అనంతాత్మ

దాని లక్ష్యమైనది. మానసిక నైతికశక్తు లభివృద్ధియైన కొలఁది లక్ష్యమునుగూర్చిన ఆ వాంఛయు నంత తీవ్రమగును.

నేఁటి బౌద్ధులు పంచేంద్రియ గమ్యముగాని ప్రతి వస్తువు మాయమనియు, మానవుఁడు స్వయంవ్యక్తుఁడు గాదనియు చెప్పుదురు. కాని ఆదర్శవాదులవాదము దీనికిభిన్నము. మానవుఁడు స్వయంవ్యక్తుఁడనియు, బహిఃప్రపంచ మతఁడు మనసున నూహించినదాని ప్రతిబింబరూపమనియు వారు చెప్పుదురు. కాని స్వతంత్రాస్వతంత్రముల, సత్యాదర్శముల సమ్మేళనరూపమే ప్రకృతి యనుట యీ సమస్యకు పరిష్కారమార్గమగును. మన మనఃకాయములు బహిఃప్రపంచము నాశ్రయించియున్నవి. వాని మధ్యఁగల సంబంధమును బట్టి యీ ఆశ్రయమున తారతమ్యముండును. కాని భగవంతునివలె అంతరాత్మయు స్వతంత్రమైనది. మనఃకాయముల అభివృద్ధి చలనక్రమములనుబట్టి అంతరాత్మ వానిని నడుపుచుండును.

మరణమనునది దశాపరిణామముమాత్రమె. మనమీ ప్రపంచములోఁ గొన్ని సామాన్య సూత్రములకు బద్ధులమై యుందుము. విజ్ఞానసౌందర్యములలో అభ్యున్నతిని సాధించి పురోగాములైనవారు వెనుకఁబడిన వారికి మార్గదర్శకులు. ఉత్తమాధములలోని ఆత్మకు భేదముండదు. మోక్షేచ్ఛ సర్వత్ర బీజరూపముననుండును. మనము గుణగ్రహణమునే

ప్రధానముగ నుంచుకొని ప్రతి వస్తువునందుఁగల మంచినే చూచుటకు ప్రయత్నింపవలయును. మన మనఃకాయములు మలినములు, కలుషితములు నని కూర్చుండి దుఃఖించినందున ప్రయోజనము లేదు. ప్రతిరోధముల నెదుర్కొని ఆత్మ పురోగతికి ప్రయత్నించుటయే వీరోచిత కృత్యము. అధ్యాత్మాభివృద్ధిసాధన సూత్రములఁ దెలిసికొనుటయే జీవిత కర్తవ్యము. క్రైస్తవులు హిందువులయొద్దను, హిందువులు క్రైస్తవులయొద్దను నేర్చుకోవలసిన విషయములు చాలఁగలవు. ఒక్కొక్కరును ప్రపంచ విజ్ఞానాభివృద్ధికి దోహదమొనర్చియే యున్నారు.

నిజమైన మతము నాస్తికతయందుఁగాక ఆస్తికతయందే కలదని మీ పిల్లలకు మీరు నచ్చఁజెప్పఁడు. చెడు కార్యములకు, గుణములకు దూరముగ నుండుటయె మతము కాదు; సత్కార్యములను చేయవలయును. ఇతరుల బోధలనువినుటవలనఁగాని, పుస్తకపఠనమువలనఁగాని నిజమైన మతమలవడదు. పవిత్రమగు వీరకృత్యములఁ జేయుటచే ఆత్మ జాగృతము కావలయును. అదియే నిజమైనమతము. పుట్టిన ప్రతిబిడ్డను నతని పూర్వజన్మకర్మఫలానుభవము వెన్నంటి వచ్చును. ఆయనుభవ మతని మనఃకాయములలో వ్యక్తమగుచుండును. కాని మనలోఁగల స్వాతంత్ర్యాపేక్ష మనఃకాయములతోఁబాటు మనలో నింకను నేదోయున్నదని

చూపును. స్వతంత్రగుణముగల మనలోని యాత్మస్వాతం త్ర్యాపేక్షను కలిగించును. మనము నిస్సంగులము కానిచో ప్రపంచమునెట్లు బాగుపఱచగలము? మానవాత్మ కృషి ఫలితమే మానవజాతి పురోభివృద్ధియని మనము నమ్ము చున్నాము. నేఁటి ప్రపంచస్థితి, మానవజాతిస్థితి ఆత్మస్వేచ్ఛా ఫలములు.

అనంతప్రేమతో తన బిడ్డలగు మనలను గాపాడువాఁ డును, సర్వవ్యాపియు, సర్వశక్తిమంతుఁడునగు దేవుఁడొక్కఁడే యని మనము విశ్వసించుచున్నాము. క్రైస్తవులవలె మన ము సాకారదైవమునే యారాధింతుము. కాని మన మొక్క అడుగు ముందుకుఁబోయి మానవుఁడే దేవుఁడని నమ్ము చున్నాము. భగవంతుని వ్యక్తిత్వము, భగవదంశ మనలో నున్నదని, మానవాంశ దేవునియందున్నదని మనము తలఁ తుము. అన్నిమతములందును సత్యబీజమున్నదని మనము భావించి దానికిఁదలయొగ్గుదుము. నాస్తికతయందుఁగాక ఆస్తి కతయందే సత్యమున్నదని మనమట్లు చేయుచున్నాము. వివిధమతములలోని సత్యపుష్పముల మాలగాఁగ్రుచ్చి మనము భగవంతునికి సమర్పింపఁగలము. ప్రతిఫలాపేక్ష లేక విధియని తలఁచి భగవంతుని మనము ప్రేమించవలయును; కర్మ నాచ రింపవలయును, సౌందర్యోపాసనము చేయవలయును. ఇట్టి పవిత్రాత్మతోనే మనము భగవంతుని దర్శింపఁగలము.

త్యాగములు, సాష్టాంగదండప్రణామములు, భగవన్నామ స్మరణలు మతముకాదు. భగవత్సాన్నిధ్యము చేరుట కుపయుక్తమగు నకలుషితాత్మలఁ బెంపొందింపఁగలిగినచో, వీరకృత్యములుచేయుటకు ప్రోద్బలకారులైనచో వానిని చేయుట మంచిదే.

మన ప్రార్థనలలో మనము అందఱకు భగవంతుఁడు తండ్రివంటి వాఁడని చెప్పుచు దైనిక జీవితములో ప్రతి మానవుని సోదరునివలెఁ జూడనిచో ప్రయోజనమున్నదా? ఉత్తమ జీవితమార్గమును జూపుటకే గ్రంథములు వ్రాయఁబడినవి. ఆ మార్గమున వెనుబాటులేక పురోగమించిననే సత్ఫలితములు కలుగును. ప్రతి మానవవ్యక్తిని గోళాకారమగు నొక దర్పణముతోఁ బోల్చవచ్చును. ప్రతిదానిమధ్యఁగల విశుద్ధాత్మయొక్కటే. దానినుండి బహిర్గతమగు కాంతియు నొక్కటె. కాని దర్పణము రంగులందును, దళసరియందును గల భేదమునుబట్టి తత్కాంతి ప్రసారమునను భేదముండును. కాంతిగుణ సౌందర్యములు సమానమే. కాని దానిని బహిర్గతమొనర్చు సాధనములోనున్న కాలుష్యపరిమాణమువలన కాంతిలో తారతమ్యమున్నట్లు గోచరించును. మానవులు పురోగతిని సాధించుకోలేఁది కాంతి ప్రసారసాధనము ఎక్కువ నిర్మలము కాఁగలదు.

# భారతీయ కళలు

శాన్‌ఫ్రాన్సిస్కో నగరమందలి 'వెంటెహోల్' లో వివేకానందులవారు 'భారతదేశమునందలి కళలు, శాస్త్రములు' అను విషయమునుగూర్చి యుపన్యసించిరి. ఉపన్యాసానంతరము శ్రోతలడిగిన పెక్కు ప్రశ్నలవలన స్వాములవారు వారి హృదయముల హత్తుకొనునట్లు ఉపన్యసించిరని తెలియుచున్నది.

వారి యుపన్యాసధోరణి కొంతవఱ కిట్లుండినది :

దేశచరిత్రలను బరిశీలించినచో మొదట నధికారము మతబోధకుల చేతియందుండినదని తెలియును. విజ్ఞానమునకుఁ గూడ వారు పట్టుఁగొమ్మలై యుండి వ్యాప్తిచేయుచుండిరి. వీరి తరువాత అధికారము రాజుల హస్తంగతమై సైనికపరిపాలనము విజృంభించినది. తరువాత భోగలాలసత ప్రబలి ఉత్సాహశక్తులఁ గోల్పోయి ప్రజలు తమకంటె బలవంతులు, ననాగరికులునగు జాతులకు లోఁబడిపోయిరి.

ప్రపంచములోని దేశములన్నిటిలో భారతదేశము ఆదినుండియు జ్ఞానభూమి యని పేరువడసినది. పూర్వమునుండియు భారతజాతి యొక్కటియే ఇతరజాతులపై దండయాత్రకు పోలేదు. భారతప్రజ లెప్పుడును యుద్ధోన్మాదులు గారు. పాశ్చాత్యులగు మీవలె వారు మాంసాహారులు గారు; మాంసాహారము యుద్ధపిపాసను రేకెత్తించును.

మాంసభక్షణముచే మీ రుద్రిక్తులై ఏదో యొకటి చేయఁ గోరుదురు.

ఎలిజబెత్ నాఁటి భారతాంగ్ల దేశములఁ బోల్చిచూడుఁడు. అప్పుడుకూడ వారు విజ్ఞానదీప్తిచే ప్రకాశించియుండ మీవారు అజ్ఞానాంధకారమున నుండిరి. ఆంగ్లో సాక్సను ప్రజలు ఎప్పుడును కళాతృష్ణ లోపించినవారుగనే యుండిరి. వారికి మంచి కవిత్వమున్నది. ఉదాహరణమునకు ఛందో నియమములేని షేక్స్పియరు కవిత్వ మెంత అందముగా నున్నదో చూడుఁడు. పదములను ఛందోబద్ధముగ, లయాన్వితముగఁ జేయుట మంచి కవిత్వము గాదు. అంతకంటె ననాగరికమైనది ప్రపంచమున వేరు లేదు.

కొన్నియుగములకు పూర్వమే భారతదేశమున సంగీతము ఎక్కువ యభివృద్ధిచెంది సప్తస్వరములు, స్వరస్థానములు, శ్రుతులుకూడ నేర్పడినవి. సంగీతమునందును, నాటకమునందును, విగ్రహశిల్పమందును భారతదేశ మున్నత స్థాయినందుకొన్నది. ఈ రంగములలో నిప్పుడు జరుగుచున్న కృషియంతయు వాని కనుకరణమాత్రమై యున్నదికాని నూతనసృష్టి లేదు. నేఁడు భారతదేశము కొద్ది జీవితావసరములతో భౌతికజీవితమును గడుపు మార్గము నన్వేషించి కళలను పునరుద్ధరించుటకుఁ దనశక్తిని ధారపోయుటకుఁ బ్రయత్నించు చున్నది.

# భారతదేశము తమఃకూపమున మునిఁగియున్నదా?

5-4-1894 తేది 'బోస్టన్ ఈవెనింగ్ ట్రాన్స్క్రిప్టు' లో సంపాదకీయాభిప్రాయములతోఁబాటు ప్రకటింపఁబడిన వివేకానందుల యుపన్యాసము (డెట్రాయిట్ నగరమున నిచ్చినది) క్రింద నీయఁబడినది :

స్వామి వివేకానందులవారు డెట్రాయిట్ నగరమునకు వచ్చియుండి ప్రజల ఆదరాభిమానములఁ జూఱఁగొనిరి. అన్ని తరగతుల ప్రజ లతని యుపన్యాసమును వినుటకై వచ్చిరి. ముఖ్యముగా విద్యావేత్తలు అతని తార్కికశక్తికి, భావ గాంభీర్యమునకు ముగ్ధులైరి. నాటకప్రదర్శనశాల (ఒపెరా హౌస్) మాత్రమే అంతమంది ప్రజానీకమునకు సరిపడి యుండెను. అతఁడు ఆంగ్లమునఁ జక్కఁగా మాటలాడఁ గలఁడు. అఁత డెంత మంచివాఁడో అంతగా అందగాఁడును. డెట్రాయిట్ లోని వార్తాపత్రిక లతని యుపన్యాసముల కెక్కువ ప్రాధాన్యము నిచ్చినవి. 'డెట్రాయిట్ ఈవెనింగ్ న్యూస్' సంపాదకీయములో నిట్లున్నది — వివేకానందు లీ పట్టణమున నిచ్చిన యితరోపన్యాసములకంటె గతరాత్రి నాటకప్రదర్శన శాలలో నిచ్చిన యుపన్యాసము మిక్కిలి గంభీరమైనదని ప్రజలు తప్పక భావించియుందురు. అతని వాక్యములలోఁ గల

స్పష్టతయే అందుకు కారణము. మూలక్రైస్తవమతమునకు నాచరణలోని క్రైస్తవమతమునకుఁగల సూక్ష్మభేదములను గూడ నతఁడుచూపెను. ఒకఅర్థమున తానుగూడ క్రైస్తవుఁడే యని యతఁడు చెప్పెను. హిందూమతవిషయమునఁగూడ నిట్టి భేదమే గలదని చెప్పి యుత్తమ హిందువుల తెగకుఁ జెందుట మాత్రమే తన వాంఛ యని చెప్పెను. "నిజమైన క్రైస్తవ మతప్రవక్తలు మాకుఁ గావలయును. అట్టివారు వందలు, వేలు భారతదేశమునకు రానిండు. క్రీస్తుజీవితాదర్శమును మా సంఘమున వ్యాపింపఁజేయనిండు. అతనిని గూర్చి వాడవాడల మూలమూలల ప్రచారముచేయనిండు" అని వివేకానందులు చెప్పినప్పుడు సర్వవిమర్శలకు వారతీతులుగ నిలువగలిగిరి!

మనుజుఁడు తాను చెప్పఁదలఁచిన ప్రధానవిషయమున దృఢాభిప్రాయుఁడై యున్నప్పు డతఁడుచెప్పిన చిల్లరవిషయములులెక్కలోనికిరావు. గ్రీన్లాండు, భారతదేశములలో మత ప్రచారాధికారము వహించినవారికి క్రైస్తవేతర మతప్రవక్త ప్రవర్తనను, జీవితమునుగూర్చి హితవాక్యములుచెప్పునపు డతనిలో నత్యంతవినయ ముట్టిపడుచుండినది. వినయవిధేయ తలు సంస్కృతికి అత్యావశ్యకములు. క్రైస్తవమతమునకు మూలపురుషుఁడగు జీససు నుదాత్తజీవితమునుగూర్చి తాను చెప్పఁదలఁచినది చెప్పిన పిమ్మట తన్మతప్రవక్తలుగా విదేశము

లలోఁ జెలామణియగువారి ప్రవర్తన మెట్లుండవలెనో దానిని గూడ నతఁడు చెప్పెను. అతని పలుకులు ఏసుక్రీస్తు చెప్పిన "ధనధాన్యములనుగాని, కూడుగుడ్డలనుగాని గూర్చిన యోచన వలదు. విశ్వాసముతోఁ బనిచేసిన మానవుని కవసరమగు కూడు గుడ్డ తప్పక లభించును" అనువానికి ప్రతిధ్వనులవలె నుండినవి. వివేకానందునికి పూర్వము వెలువడిన భారతీయాధ్యాత్మికవాఙ్మయముతో పరిచయమున్నవారు మతమునందు సయితము పాశ్చాత్యులకుఁ గల వ్యాపార దృక్పథమును ప్రాచ్యు లెంత అసహ్యించుకొనుచుండిరో సులభముగ గ్రహింపఁగలరు.

ఈ సందర్భమున క్రైస్తవమతబోధకులు జ్ఞాపకముంచుకోవలసిన విషయ మొకటి యున్నది. క్రైస్తవేతరులగు ప్రాచ్యులను తమమతములోఁ జేర్పఁదలఁచువారు మాటలొకటి చేఁతలొకటి గాకుండ ఆదర్శజీవితము గడపుచు నిహామునకు, నైహికభోగములకు దూరముగ నుండవలయును.

భారతదేశము ప్రపంచములోని దేశములలోకెల్ల మిక్కిలి నీతిమంతమగు దేశమని వివేకానందుల యభిప్రాయము. బానిసస్థితిలో నున్నప్పటికి అచట ఆధ్యాత్మికతకు లోపములేదు. ఇటీవల ఈ నగరమున నిచ్చిన ఉపన్యాసముల నుండి కొన్నివాక్యములు క్రింద నుదహరింపఁబడినవి. తన ప్రజలు స్వార్థము పాపమని, స్వార్థరాహిత్యము పుణ్యమని

భావించుచున్నట్లు స్వాములవారు చెప్పిరి. వారు తమ యుపన్యాసమున నీ విషయమునకే యెక్కువ ప్రాధాన్య మిచ్చిరి. "హిందువు తనకొఱకిల్లు కట్టుకొనుట స్వార్థమని యెంచి దానిని భగవత్పూజకొఱకు, అతిథిసత్కారముకొఱకు కట్టును. తనకొఱకు వండుట స్వార్థమని భావించి పేదప్రజల కొఱకు అతఁడు వండును. ఆఁకొన్న అతిథ్యభ్యాగతులకుఁ బెట్టిన తరువాతనే యతఁడు భుజించును. భారతదేశమున సర్వత్ర ఈ యభిప్రాయ మున్నది. నిలువ నీడ, తిన తిండి గోరు ఏ మనుజునికైనను ప్రతిగృహము స్వాగతమిచ్చును."

"మతమునకు కులతత్త్వమునకు సంబంధము లేదు. మానవవృత్తి వంశపారంపర్యమునకు సంబంధించినది. వడ్రంగి, కంసాలి, శ్రామికుఁడు, మతగురువు మొదలగువారు పుట్టుకతోనే ఆయావృత్తుల నవలంబించుచున్నారు."

"విజ్ఞానదానము, ప్రాణదానము ముఖ్యమైన దానములుగా పరిగణింపఁబడినవి. ఈ రెంటిలో మొదటిదానికే అగ్రతాంబూలము. ప్రాణరక్షణముచేయుట మంచిదే. కాని దానికంటె జ్ఞానదాన ముత్తమమైనది. విద్యగఱపి ధన మార్జించుట మంచిదికాదు. విద్య నొక వ్యాపారవస్తువుగా నెంచి దానికి బదులు ధనము గ్రహించుట సిగ్గుచేటు. రాజు లప్పుడప్పుడు గురువులకు పారితోషికములిచ్చెడువారు. ఈ విద్యావిధానమువలని ఫలితములు నాగరికములని చెప్పఁబడు

దేశములలోని పరిస్థితులవలనఁ గలుగఁగల ఫలితములకంటె మెఱుఁగుగానుండినవి'' ఈ యుపన్యాసకుఁడు ఈ దేశమందెల్ల డల నాగరికతా శబ్ద నిర్వచనమేమి యని ప్రశ్నించినాఁడు. పెక్కు దేశములలోఁగూడ నీప్రశ్ననువైచినాఁడు. కొన్నిచోట్ల ''నేఁటి మనపరిస్థితియే నాగరకత'' యను సమాధానము వచ్చినది. ఈశబ్ద నిర్వచనమున తాను భిన్నాభిప్రాయము గలవాఁడనని ఇతఁడుచెప్పినాఁడు. ఒకజాతి ప్రకృతిశక్తులను జయింపవచ్చును; జీవితౌపయోగికముల నెన్నింటినో వృద్ధి పొందించుకొనవచ్చును; కాని స్వార్థమును జయించిన వాని యందే యుత్తమమగు నాగరకత యున్నదని గ్రహింపక పోవచ్చును. ఈ యుత్తమనాగరకత యితరదేశములందు కంటె భారతదేశముననే యెక్కువగనున్నది. ఏలన అచ్చటనే ఆధ్యాత్మికస్థితికి భౌతికములు దాసోహమన్నవి. ప్రాణమున్న ప్రతివస్తువునందును ఆత్మ పరివర్తనముల నచటివ్యక్తి పరిశీలించును. ప్రకృతియెడ నతని కీదృష్టియే యుండును. ఇతరులకంటెఁ దనయందు ఆధ్యాత్మికశక్తి, జ్ఞానము మిక్కుటముగానున్నవను నాత్మవిశ్వాసముతో నతఁడు అదృష్టదేవత చిన్నచూపును సహించును. భారతజాతి అధ్యాత్మశక్తి విదేశములలోని తాత్త్వికులదృష్టి నాకర్షించి వారి నైహికవాంఛా రహితులఁ జేయుచున్నది.

ఉపన్యాసమునకు ముందు శ్రోతలు స్వామివారిని అనేక

ప్రశ్నలడిగిరి. అందు పెక్కు ప్రశ్నలకు నచట జవాబు చెప్పుటకు నిరాకరించి మూఁడింటికి మాత్రము వేదికనుండియే జవాబు చెప్పిరి. అవి—1. భారతదేశప్రజలు మొసళ్ల కాహారముగఁ దమపిల్లల పాఱవైతురా? 2. జగన్నాథరథచక్రాలక్రిందఁబడి ఆత్మబలి చేసికొందురా? 3. మరణించిన భర్తలతోపాటు భార్యలను దహించివైతురా? మొదటి ప్రశ్నకు విదేశీయులలో అమెరికాదేశీయుఁడు న్యూయార్కు వీథులలోఁ దిరుగు ఎఱ్ఱయిండియనులఁగూర్చియు, తనదేశములో నేఁటికిని ప్రచారముననున్న పుక్కిటిపురాణములఁగూర్చియు నెట్టి ధోరణిలో జవాబు చెప్పఁగలఁడో ఆధోరణిలోనే వివేకానందులు జవాబు చెప్పిరి.—ఆప్రశ్నలో నడిగిన విషయము హాస్యాస్పదమైనది. కావున దాని జవాబునకై అంత యోచింపవలసిన పనిలేదు. ఆడుపిల్లలనే యెందుకు మొసళ్లకిత్తురని అడుగఁగా స్వాముల వారు ఆపిల్లలు సుకుమారముగను కోమలముగను నుండుటచే నదీజీవులకు సులభముగా జీర్ణమగునవి కాబోలు అని మాత్రమే వ్యంగ్యముగాఁ జెప్పిరి. రెండవప్రశ్న కిట్లు జవాబు చెప్పిరి:—ఆ పుణ్యక్షేత్రమున రథోత్సవము జరిగెడిది. ఆ సమయమున నచటికి వచ్చిన యాత్రికు లుత్సాహముతో రథమునకుఁ గట్టిన త్రాళ్లను పట్టుకొని లాగుచు జారి క్రిందఁ బడి నలిగిపోయి యుందురు. ఈ విషాదఘట్టములకు వింత వ్యాఖ్యానములను చేయుటచే సహృదయులగు విదేశీయులు

కొందరు వీనియెడ విభ్రమాశ్చర్యముల వెలిబుచ్చిరి. మూఁడవ ప్రశ్నలో నడిగిన విషయము వాస్తవముకాదని వివేకానందులు చెప్పిరి. కాని భార్య ఐచ్ఛికముగా సహగమనము చేయుట మాత్రము నిజమే. ఇట్టి సంఘటన లెక్కువ లేవు. ఆత్మహత్యను సహింపనేరని సాధువర్తనులు వీనిని వారించియే యున్నారు. పతివ్రతలగుస్త్రీలు తామును సహగమనమును చేయవలయునని కోరఁగా అట్టివారిని వారించక అగ్నిపరీక్షకు వదలివేసిరి. ఎట్లన నాసాధువర్తనులా స్త్రీల చేతులను మంటలోఁ జొనుపుదురు. అప్పుడు వారగ్నిజ్వాలలను సునాయాసముగ, నగుమోములతో సహింపఁగలిగినచో నట్టివారి నిఁక నాక్షేపింపక సహగమనమున కనుమతింతురు. పతివ్రతలు, భర్త్రనురాగముగలవారునగు స్త్రీలు భర్తలతో మరణించుట ఒక్క భారతదేశములోనే కాదు; ఇతర దేశములందును గలదు. ఏ దేశమందైనను నిది అసాధారణమగు మూఢవిశ్వాసమే. ఇతరదేశములందువలె భారతదేశమందును క్వాచిత్కమే. భారతదేశప్రజలు స్త్రీలను ప్రాణములతో దహింపరు. అంతేగాదు; మంత్రగత్తెలను (witches) గూడ దహింపలేదు.

ఈ చివరి వాక్యము నిజముగ నెంతో వ్యంగ్యార్థము గలిగి మనపై దెబ్బతీయుచున్నది. హైందవసన్న్యాసి వేదాంతము ఆత్మ అనంతాత్మ (భగవంతుని) లో లీనమగు

ప్రశ్నలడిగిరి. అందు పెక్కుప్రశ్నలకు నచట జవాబుచెప్పుటకు నిరాకరించి మూఁడింటికి మాత్రము వేదికనుండియే జవాబు చెప్పిరి. అవి—1. భారతదేశప్రజలు మొసళ్ల కాహారముగఁ దమపిల్లల పాఱవైతురా? 2. జగన్నాథరథచక్రాలక్రిందఁబడి ఆత్మబలి చేసికొందురా? 3. మరణించిన భర్తలతోపాటు భార్యలను దహించివైతురా? మొదటి ప్రశ్నకు విదేశీయులలో అమెరికాదేశీయుఁడు న్యూయార్కు వీథులలోఁ దిరుగు ఎఱ్ఱఇండియనులఁగూర్చియు, తనదేశములో నేఁటికిని ప్రచారమున నున్న పుక్కిటిపురాణములఁగూర్చియు నెట్టి ధోరణిలో జవాబు చెప్పఁగలఁడో ఆధోరణిలోనే వివేకానందులు జవాబు చెప్పిరి.—ఆప్రశ్నలో నడిగిన విషయము హాస్యాస్పదమైనది. కావున దాని జవాబునకై అంత యోచింపవలసిన పనిలేదు. ఆడుపిల్లలనే యెందుకు మొసళ్లకిత్తురని అడుగఁగా స్వాముల వారు ఆపిల్లలు సుకుమారముగను కోమలముగను నుండుటచే నదీజీవులకు సులభముగా జీర్ణమగునవి కాబోలు అని మాత్రమే వ్యంగ్యముగాఁ జెప్పిరి. రెండవప్రశ్న కిట్లు జవాబు చెప్పిరి:—ఆ పుణ్యక్షేత్రమున రథోత్సవము జరిగెడిది. ఆ సమయమున నచటికి వచ్చిన యాత్రికు లుత్సాహముతో రథమునకుఁ గట్టిన త్రాళ్లను పట్టుకొని లాగుచు జారి క్రిందఁబడి నలిగిపోయి యుందురు. ఈ విషాదఘట్టములకు వింత వ్యాఖ్యానములను చేయుటచే సహృదయులగు విదేశీయులు

కొందరు వీనియెడ విభ్రమాశ్చర్యముల వెలిబుచ్చిరి. మూఁడవ ప్రశ్నలో నడిగిన విషయము వాస్తవముకాదని వివేకానందులు చెప్పిరి. కాని భార్య స్వేచ్ఛికముగా సహగమనము చేయుట మాత్రము నిజమే. ఇట్టి సంఘటన లెక్కువలేవు. ఆత్మహత్యను సహింపనేరని సాధువర్తనులు వీనిని వారించియే యున్నారు. పతివ్రతలగుస్త్రీలు తాము సహగమనమును చేయవలయునని కోరఁగా అట్టివారిని వారించక అగ్నిపరీక్షకు వదలివేసిరి. ఎట్లన నాసాధువర్తను లాస్త్రీల చేతులను మంటలోఁ జొనుపుదురు. అప్పుడు వారగ్నిజ్వాలలను సునాయాసముగ, నగుమోములతో సహింపఁగలిగినచో నట్టివారినిఁక నాక్షేపింపక సహగమనమున కనుమతింతురు. పతివ్రతలు, భర్త్రనురాగముగలవారునగు స్త్రీలు భర్తలతో మరణించుట ఒక్క భారతదేశములోనే కాదు; ఇతర దేశములందును గలదు. ఏదేశమందైనను నిది అసాధారణమగు మూఢవిశ్వాసమే. ఇతర దేశములందువలె భారతదేశమందును క్వాచిత్కమే. భారతదేశప్రజలు స్త్రీలను ప్రాణములతో దహింపరు. అంతేగాదు; మంత్రగత్తెలను (witches) గూడ దహింపలేదు.

ఈ చివరి వాక్యము నిజముగ నెంతో వ్యంగ్యార్థము గలిగి మనపై దెబ్బతీయుచున్నది. హైందవసన్న్యాసి వేదాంతము ఆత్మ అనంతాత్మ (భగవంతుని) లో లీనమగు

టకు చేయు కృషిమీఁద నాధారపడియున్నదనుట కంటె ఎక్కువ వివరింపనక్కఱలేదు. ఒక హైందవ పండితుఁడు ఈ సంవత్సరము లోవెల్ ఇన్స్టిట్యూట్ కోర్సును ప్రారంభించి నాఁడు. మజుందార్ పునాదివేసినపని వివేకానందులచే జయ ప్రదముకాఁగలదు. ఈ క్రొత్తవ్యక్తి అత్యాకర్షణీయమగు నాకారమును రూపురేఖలను గలిగియున్నాఁడు. కాని హిందూమత సిద్ధాంతములో నీరూపమునకు స్థానములేదు. మతపరిషత్తులో సమావేశము ముగియువఱకు ప్రజలనుంచు నుద్దేశముతో నచట వివేకానందు నుంచువారు. ఎప్పుడైన నొక సామాన్యోపన్యాసకుఁడు గంటలకొలఁది మాటాడిన ప్రజలు విసుగెత్తి ఇంటిత్రోవ పట్టుదురు. అప్పు డధ్యక్షుఁడు లేచి వారిని కూర్చుండఁ జేయుటకై వివేకానందులు కొంతసే పుపన్యసింపఁగలరని చెప్పును. వెంటనే ప్రజలు నిశ్శబ్దముగాఁ గూర్చుందురు. కొలంబస్ హాలులో ఊపిరాడక సతమతమవు చున్న నాల్గువేల ప్రజలు వివేకానందుని కొద్దిమాటలు విను టకై ఒకటి రెండు గంటలు నగుమోములతో, నుత్కంఠతోఁ గాచుకొనియుందురు.

# ప్రజానీకమునెడ మనకర్తవ్యము*

మిమ్ము మీ ప్రజలను శ్రీమన్నారాయణుఁడు రక్షించుఁగాత! ప్రభువులుంగారి కృపారసముచే నే నీదేశమునకు వచ్చి యిక్కడ ప్రజాదరమును బొందుచున్నాను. నా కేలోటు లేకుండ దయార్ద్రమనస్కులగు నిచ్చటి ప్రజలు నన్నుఁ జూచుచున్నారు. ఈ దేశమును, నిచ్చటి ప్రజలను చూచిన మన కాశ్చర్యము కలుగును. యంత్రముల నీ జాతి దైనిక జీవితమున నుపయోగించునంతగా నేజాతియు నుపయోగింపదు. ప్రతివస్తువు, కార్యము యాంత్రికమే. ప్రపంచజనసంఖ్యలో నిరువదవవంతు మాత్ర మున్నను నీ ప్రజలు ఆఱవవంతు ధనమును గలిగియున్నారు. వీరి భోగభాగ్యముల కంతు లేదు. వస్తువుల ధరలును విపరీతముగనే యున్నవి. కార్మికుల కిచ్చట నిచ్చుచున్నంత కూలి ప్రపంచములో నెక్కడను లేదు. కాని యజమానులకు, కార్మికులకు మధ్య పోరాటము నిరతము సాగుచునే యున్నది.

స్త్రీల కిక్కడనున్న సౌకర్యములు, స్వాతంత్ర్యము నెందును లేదు. స్త్రీలు అన్నింటిని క్రమముగాఁ దమ కైవ

---

* 23-6-1894 న చికాగోనుండి మైసూరుమహారాజావారికి వ్రాసినది.

సము గావించుకొనుచున్నారు. సంస్కారముగల పురుషుల కంటె స్త్రీలే యెక్కువగ నుండుట ఆశ్చర్యకరమైన విషయము. కాని ఉత్తమశ్రేణికిఁ జెందిన విజ్ఞానవేత్తలు చాలవఱకు పురుషులే. మనలోఁగల వర్ణవ్యవస్థను పాశ్చాత్యులు విమర్శింతురు. కాని వారిలోఁగల ధనారాధన మంత కంటెను నీచమైనది. అమెరికనులు డాలరు (వారి నాణెము) ను (భగవంతునికంటె )సర్వశక్తిమంతమైనదిగా భావింతురు. ఆ డాలరు ఇచ్చట ఎంత పనినైనను చేయఁగలదు.

ఈ దేశముననున్నన్ని చట్టము లేదేశముననుు లేవు. కాని ఆచట్టములను పీరు నిర్లక్ష్యముచేసినంతగా నెవరును జేయరు. పేదలగు మన హిందూప్రజలు పాశ్చాత్యులకంటెను నెక్కువ నీతిమంతులు. ఇచ్చటి ప్రజలు మతమును మూఢముగ ననుసరించుటయో లేక దానియెడ కృత్రిమ ప్రేమ కలిగియుండుటయోగలదు. మూఢవిశ్వాసములతో నిండిన మతము నెడ కొందఱు బుద్ధిమంతులకు విసుగుజనించి నూతన తేజఃపుంజమును ప్రసరించి దారిచూపఁగలదని భారతదేశము వైపు చూచుచున్నారు. ఆధునిక శాస్త్రవిజ్ఞానమునకు నెదురొడ్డి యకుంఠితముగ నిలిచిన పవిత్రవేదములలోని ఉదాత్తాశయములయొక్క లేశమాత్రమునైనను వారు మహాప్రసాదముగ స్వీకరించుచున్నారు. కన్నులారఁ జూడనిదే తమకీ విషయ మవగతముకాదు. "శూన్యమునుండి సృష్టి

యేర్పడినది, ఆత్మకుఁ జావుపుట్టుకలున్నవి. భగవంతుఁ డెక్కడో స్వర్గసామ్రాజ్యము నేలుచున్నాఁడు, నరకలోకమున నగ్నిజ్వాలలు విజృంభించియుండును'' అను వానికి సంబంధించిన సూత్రములయెడ పండితలోకమున కసహ్యముకలిగినది. ''సృష్టియు, ఆత్మయు శాశ్వతములైనవి. మన ఆత్మలోనే భగవంతుఁడున్నాఁడు'' మున్నగు వేదవాక్యములు వారికి నాదరపాత్రములగుచున్నవి. ఇఁక నేఁబదియేండ్లలో ప్రపంచములోని పండితులందఱు వేదములలోని యీ వాక్యములను తప్పక విశ్వసింపఁగలరు. నేఁడుఁగూడ వారి మతప్రవక్తలు బైబిలును ఈ ధోరణిలోనే వ్యాఖ్యానించుచున్నారు. ఇంతకును నేను జెప్పఁదలఁచినదేమన వీరికాధ్యాత్మదృష్టియు, మనకు భౌతికదృష్టియు నెక్కువ కావలయుననియే.

భారతదేశములోని బీదలస్థితి సకలదోషములకు మూలమైయున్నది. పాశ్చాత్యదేశములలోని బీదలు రాక్షసప్రకృతిగలవారు; కాని మనదేశములోనివారు దైవసమానులు. అందుచే వారిని పునరుద్ధరించుట సులభతరమైనది. వారు విద్యను, కోల్పోయిన వ్యక్తిత్వమును పొందునట్లు చేయుటయే మనకర్తవ్యము. దానికిమించిన సేవలేదు. ప్రజలు, ప్రభువులు నేకమై నిర్వర్తింపవలసినపనియిది. ఇందుకొఱకుఁ గొంతకృషియైనను నింతవఱకు జరిగియుండలేదు. మతగురువుల ప్రాబల్యము, విదేశపరిపాలన శతాబ్దముల

కొలందివారి నణంగఁద్రొక్కినవి. తత్ఫలితముగ భారత దేశమం దలి బీద ప్రజానీకము తాముగూడ మానవుల మనుమాట మఱచిరి. వారి కుత్తేజమును కలుగఁజేయవలయును; కను విప్పుకలిగించి వారిచుట్టు ప్రపంచమున నేమి జరుగుచున్నదో గ్రహించునట్లు చేయవలయును. అప్పుడు వారు తమ స్వేచ్ఛకై ప్రయత్నింపఁగలరు. ప్రతిజాతియు, స్త్రీ పురుషు లును తమతమ ముక్తికొఱకు కృషి చేయవలయును. వారికి యోచనాశక్తిని కలుగఁజేయవలయును. ఫలితములు వాని యంతట నవి యనుగమింపఁగలవు. రసాయనముల మిళితము చేయుటయే మనపని. రసాయనిక పరిణామము సహజముగ జరిగిపోఁగలదు. భారత దేశములో నేఁటి కర్తవ్యమిదియే. ఈ యుద్దేశ్యమే నాలోఁ జాలకాలమునుండియు నున్నది. భారత దేశములో నీ యుద్దేశ్యమునకు రూపమునీలేక నే నిచటికి వచ్చితిని. బీదలను విద్యావంతులఁజేయుటలో ముఖ్య ప్రతిబంధక మొకటియున్నది. తమరే యొక పల్లెటూరి యందు ఉచిత విద్యాలయమును స్థాపించితిరనుకొనుఁడు. కాని దానివల్ల మీరాశించినంత ఫలితముండదు. ఏలన బీదపిల్లలు బడికిరాక పొలములకు తమతలిదండ్రుల సహాయార్థము పోవు టయో, లేక యితరవిధముగ జీవనభృతిని సంపాదించుటయో జరుగును. హిందూదేశస్థితి యట్లున్నది.

బీద బాలుఁడు విద్యార్థియైరాకున్న విద్యయే వాని

కొలకుఁ బోవలయును. ఏకాగ్రచిత్తులు, ఆత్మత్యాగులునగు వేలకొలఁది సన్న్యాసులు ఊరూరుతిరుగుచు మత ప్రచారము చేయుచున్నారు. వీరిలోఁ గొంతమందిని ఉపాధ్యాయులుగాఁ దయారుచేసిన వారు ఊరూరు, ఇల్లిల్లు తిరిగి మతముతోఁ బాటు వైజ్ఞానికవిషయములఁ బెక్కు బోధింపఁగలరు. ఇద్దరు సన్న్యాసులు దూరదర్శిని, గ్లోబు, దేశపటములు మొదలగు వానిని దీసికొని సాయంత్ర మొకయూరికిఁ బోయిరనుకొనుఁడు. వారు నక్షత్ర భూగోళశాస్త్రములను అజ్ఞానులగు ప్రజలకు బోధింపవచ్చును. నూఱుపర్యాయములు చదువుటచేఁ గలుగు జ్ఞానము ఒక్కపర్యాయము వినుటచేఁగలుగును. కావున వివిధదేశములను, జాతులనుగూర్చి కథలుగా వారికిఁ జెప్పినఁ దొందరగ వారు లోకజ్ఞానముకలవారగుదురు. ఇందుకొక విధానము, ఒక ప్రణాళిక యవసరము. దీనికి డబ్బు కావల యును. భారతదేశమున నిందుకవసరమగు మందియున్నారు. కాని డబ్బులేదు. ఈ ప్రణాళికను నమలులోనికిఁ దెచ్చుట కష్టము. తెచ్చితిమా దినదినము పురోగతిని జెందుచునుండఁ గలదు. మనదేశములో సాయమపేక్షించి ధనికులసానుభూతి పొందలేక తమ యౌదార్యముచేత నేనీదేశముచేరితిని. భారతదేశములోని బీదలు చచ్చినను, బ్రదికినను అమెరికా వారికి లెక్కలేదు. మనవారే స్వార్థపరులై యుండ నిఁక విదేశీయులగు వీరిసంగతి చెప్పనేల?

ఓ మహారాజా! జీవితము క్షణికము. ఐహికభోగము లస్థిరములు. ఇతరుల శ్రేయస్సుకై జీవితము ధారవోయు వారే ధన్యజీవులు. మిగిలినవారు బ్రదికియు చచ్చినవారితో సమానమే. ఉదారహృదయులగు మీవంటి మహారాజు లొక్కరు భారతదేశ పునరుద్ధరణకెంతైనను చేసి భావితర ములవారి కాదర్శప్రాయులై వారి పూజలందఁగలరు.

అజ్ఞానాంధకారమున మునిఁగి కష్టస్థితిలోనున్న భారత దేశప్రజలయెడ మీ ఉదారహృదయమును ఎక్కువస్పందింపఁ జేయవలయునని భగవంతుని ప్రార్థించు—

వివేకానంద

# కలకత్తా సమావేశ తీర్మానములకు సమాధానము*

ఇటీవల కలకత్తా 'టౌన్ హాల్' లో జరిగిన సమావేశ తీర్మానములు, నా దేశీయుల శుభాకాంక్షలు నాకందినవి. అందుకు నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

నా చేసిన యీకొద్దిసేవ మీ పొగడ్తలకుఁ బాత్ర మైనది. నేను కృతార్థుఁడనైతిని.

ఇతరవ్యక్తులకు, జాతులకు దూరముగనుండి ఏవ్యక్తి గాని, జాతిగాని మన లేదని నాగాఢవిశ్వాసము. పవిత్రతకు భంగమని, గొప్పతనమని, సిద్ధాంతమని అపోహాచే నెప్పుడైన నట్టి ప్రయత్నము జరిగినచో నది ఆవ్యక్తికి, జాతికి ప్రమాదకర మేయైనది.

బౌద్ధమతావలంబములగు పరిసర దేశములతోడి సంబంధమును నివారించు నుద్దేశ్యముతో విమత ద్వేషము ప్రాతిపదికగాఁగల నొక యాచారమును హిందువులు పాటిం

---

* పాశ్చాత్య దేశములలోని స్వామివారికృషి నభినందించుచు కలకత్తా టౌన్ హాల్ లో జరిగిన సభాధ్యక్షులకు 18-11-1894 న న్యూయార్కునుండి వ్రాసినది.

చుటయే భారతదేశ పతనమునకు ప్రధానకారణమని నాయభిప్రాయము.

ప్రాచీనాధునిక తార్కికులు దానికే పేరు పెట్టినను తత్ఫలితముగ ప్రాచీన జాతులలో నెక్కువ పురోగతినంది యుండిన జాతి నేఁడు పతనస్థితినంది యితరజాతులచేఁ జులకనగాఁ జూడఁబడుచుండుట మాత్రము వాస్తవము. నరుఁడితరుల ద్వేషించుట ఆత్మపతనమునకే యను నీతిసూత్రమునకిది స్పష్టోదాహరణము. మన ప్రాచీనుల సిద్ధాంతమును మనమే విస్మరించినాము.

ఇచ్చిపుచ్చుకొనవలయునను న్యాయము గలదు. భారతదేశము తన మూలధనమును వెలికిఁ దీసి ప్రపంచములోని యితరదేశములందు వెదచల్లి దానికి బదులు అవి యియ్యఁగలవానిని గ్రహించుటకు సిద్ధపడవలయును. భారతదేశ పునరుద్ధరణ కిదియే మార్గము. వ్యాకోచమే జీవనము; సంకోచమే మరణము. ప్రేమయే జీవనము; ద్వేషమే మరణము. ఇతరజాతుల ద్వేషింప మొదలిడినప్పుడే మనము మృతప్రాయులమైతిమి. జీవనమునకు నిదర్శనమగు వ్యాకోచస్థితికి రానిచో మన కందునుండి విముక్తి లేదు.

కావున మనము ప్రపంచములోని యన్ని జాతులతోఁ గలిసిమెలిసి మెలఁగవలయును. మూఢవిశ్వాసములతో, స్వార్థముతో స్వదేశమున జీవించు వేలకొలఁది హిందువుల

కంటె విదేశయాత్ర సాగించు నొక్కొక్క హిందువు తన దేశమున కెక్కువ సేవ చేయఁగలఁడు. పాశ్చాత్య దేశముల లోని జాతీయ జీవన సౌధములు శీల స్తంభములపై పటిష్ఠ ముగ నేర్పడినవి. అట్టివాని నసంఖ్యాకముగ మనము నిర్మించు వఱ కెవరిపైఁగాని కారములు మిరియములునూఁతి ప్రయోజనము లేదు.

ఇతరులకు స్వేచ్ఛ నిచ్చుటకు సిద్ధముగ లేనివాఁడు స్వేచ్ఛగానుండ నర్హుఁడేనా? అనవసరోద్రేకములకుఁ దావీయక ప్రశాంతముగ నిజమైన మానవుఁడుగాఁ బనిచేయును గాక. దాని ఫలమును అతఁడు తప్పక పొందఁగలఁడు. ప్రపంచమున నెట్టి శక్తియు దీని కంతరాయమును గల్పింపఁజాలదని విశ్వసించువారిలో నేనొకఁడను. గతించిన కాలము గొప్పదే కాని భవిష్యత్తు అంతకంటెను మెఱుఁగుగా నుండఁగలదని చెప్పుచున్నాను.

పరమేశ్వరుఁడు మనలను నిష్కల్మషహృదయులుగను, సహనశీలురుగను, పట్టుదలగలవారినిగను జేయుఁగాక!

# ధీర భారత బాలురకు*

ఒకవ్యవస్థతో, ఒక ప్రణాళికతో పురోగమింపుఁడు. ప్రేమ, ఆత్మవిశ్వాసము, సహనము — ఇవియే మనకుఁ గావలసినవి ; ఇంకేమియువలదు. జీవమనఁగానేమి?— పెరుగుటయే; వ్యాకోచమే; ప్రేమయే. కావున ప్రేమయే జీవన లక్షణము; ప్రధానజీవనసూత్రము. స్వార్థమే మరణము. ఈ సూత్రము సర్వసమ్మతమైనది. ఇతరులకు మేలుచేయుటయే జీవనము. మేలు చేయకుండుట మరణము. నూటికి తొంబదితొమ్మిది పాళ్లు మానవులు జీవన్మృతులే. భూత ప్రేతములతో సమానులే. ఏలన, ప్రేమించువాఁడే నిజముఁగా జీవముగలవాఁడు. కావున బాలురారా! బీదలు, నజ్ఞానులు, పతితులునగు వారియెడ సానుభూతిపరులు కండు. ఆ సానుభూతి గాఢమై హృదయచలనమాగునట్లు, మేధ వేఁడెక్కి పిచ్చివారమగుదు మనిపించునట్లు నుండవలయును. అప్పుడు మీ ఆత్మలను భగవత్సన్నిధిని నర్పింపుఁడు. అప్పుడు సాయము, నిరాఘాటమగుశక్తియుక్తులు మీకు లభించును. కష్టముల ధైర్యముతో నెదుర్కొనుఁడు. గతించిన పదియేండ్లలో నదియే నాలక్ష్యముగా నుండినది. కష్టములనుభవింపుఁ

---

* తే 19-11-1894 ది న్యూయార్కునుండి వ్రాసినది.

డనియే నా ప్రబోధము. అంధకారమునఁ జిక్కుకొని దిక్కు-తోఁచనప్పుడును, జ్యోతిలభించి వెలుఁగులోనున్నప్పుడును నీ ప్రబోధమునే నేను చేయుదును. బిడ్డలారా! అధైర్యము చెందకుఁడు. నక్షత్రరాశిలో విరాజిల్లు ననంతాకాశము మీా మీాఁద విఱిగిపడునను భయదృష్టితో దానిని జూడకుఁడు. తొందరపడకుఁడు! ఇఁక కొద్దిగంటలలో నదియంతయు మీా పాదాక్రాంతము కాఁగలదు. ఆలోచింపుఁడు; ధనము, పేరు ప్రఖ్యాతులు, విజ్ఞానము మొదలగువానివలన ప్రయోజనము లేదు. ప్రేమయే సర్వఫలప్రదాయి, శీలమే కష్టపరంపర నుండి గట్టెక్కించునది.

మన మెదుర్కొనుచున్న ప్రశ్న యిది. స్వేచ్ఛా స్వాతంత్ర్యములు లేనిదే యభివృద్ధి యుండదు. స్వతంత్ర యోచనకుఁ దావుగల అత్యద్భుతమగు నొక మతమును మన పూర్వులు మనకిచ్చియున్నారు. కాని వారు సంఘమును శృంఖలాబద్ధము గావించిరి. అందుచే మనసంఘము భయంకర మగు పెనుభూతమువలెఁ దయారైనదని చెప్పవచ్చును. పాశ్చాత్య దేశములలో సంఘమున కెప్పుడును స్వేచ్ఛ యుండెడిది. వారి మత స్థితి దీనికి విరుద్ధముగ నున్నది.

సర్వతోముఖాభివృద్ధికి స్వేచ్ఛ ముఖ్యావసరము. మానవునకు యోచనాస్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము అవసరమైనట్లే ఆహారపానీయములందు, వస్త్రధారణమందు,

వివాహవిషయమందును స్వేచ్ఛ యవసరమే. కాని ఆ స్వేచ్ఛ యితరులకు బాధాకరముకారాదు.

భౌతికమగు నాగరకతనుగూర్చి మనము గ్రుడ్డిగా ప్రతిఘటించుచున్నాము. అందని ద్రాక్షపండ్లు పులుపు. ఈ ప్రతిఘటన సమంజసమైనదని యెవ్వరైనా నెప్పటికి భారతదేశమంతటఁ జూచిన నిజమగు నాధ్యాత్మికదృష్టిగల స్త్రీపురుషులు ఒకలక్షమందిమాత్రమున్నారు. ఈ ఆధ్యాత్మికరణముకొఱకు ముప్పదికోట్లప్రజలు అనాగరకదుఃస్థితిలో నాఁకలిమంటతో బాధపడవలసినదేనా? ఎవరుకాని ఆఁకలిచే నేల బాధపడవలయును? హిందువులు మహమ్మదీయులచే నేల పరాజితులైరి? భౌతికనాగరకతను హిందువులు సాధింపక పోవుటయే యిందులకు కారణము. దర్జీవాఁడు కుట్టిన బట్టలను తొడగుట మహమ్మదీయులే హిందువులకు నేర్పిరి. వీథులలోని దుమ్ము ధూళి కలియకుండ అన్నము తినుటకూడ వారే నేర్పిరా! బీదలకుఁ బనికల్పించుటకు భౌతికమగు నాగరకత, ఆడంబరజీవనము అవసరములు. జీవమున్నంతవఱకు కడుపునకుఁ దిండి యుండవలయును. ఇచ్చట తిండిలేక మాడఁబెట్టి చనిపోయిన తరువాత స్వర్గమున నఖండబ్రహ్మానందము కలిగించు దేవునియెడ నాకు నమ్మకములేదు! భారతదేశస్థితి బాగుపడవలయును. బీదలకు కావలసిన యన్నము అందుపాటులో నుండవలయును. విద్యావ్యాప్తి కావలయును.

మతగురువుల దౌష్ట్యమును తొలఁగింపవలయును. ఈ మత గురువులు వలదు; సాంఘికదురాచారములును వలదు. అందఱికిఁ దిండి, సమానావకాశములు కావలయును! ...

స్వేచ్ఛనొకరికీయఁగలవాఁడే స్వేచ్ఛగానుండ నర్హుఁడు. ఆంగ్లేయులు తమఅధికారమును మీ చేతిలోఁ బెట్టిరను కొనుఁడు. అప్పు డేమి జరుగును? మీ అధికారము ప్రజల నింకను పతితులఁ జేయఁగలదు. అందుచే నా అధికారము మీ చేతులకు రాకుండుఁగాక. బానిసలు బానిసరాజ్యమును గావించుటకే అధికారమును గోరుదురు.

అందుచే మతమున మార్పు తీసికొనివచ్చి క్రమముగా సంఘమునకు స్వేచ్ఛనిచ్చుట ప్రస్తుతకర్తవ్యము. ప్రాచీన మతములోని మతగురువుల నిర్మూలముచేయుఁడు. అప్పుడు మీ మతమునకు సాటియగు మతము ప్రపంచమున నింకొకటి యుండదు. నా మాటలు మీ కర్థమగుచున్నవా? భారతీయ మతముతో నైరోపీయసంఘనిర్మాణము మీకు సాధ్యమా? సాధ్యమని, అట్లే జరుగఁగలదని నా నమ్మకము.

మీ విశ్వాసములను, ఆదర్శములను స్వేచ్ఛగా నాచ రింపఁగల వలసప్రదేశమువంటిదాని నొకదానిని మధ్యభారత మున స్థాపించుటయే నేఁడవసరమగునది. ఇది క్రమ ముగా దేశమంతట వ్యాపింపఁగలదు, ఈ ప్రణాళికకుముందు

కేంద్రసంఘము నొకదాని నేర్పఱచి దానిశాఖలను భారత దేశమంతట నెలకొల్పుఁడు. దీనికి మొదట మతమే ప్రాతిపది కగా నుండవలయును; కాని సంఘసంస్కరణమునకుఁ బూను కొనరాదు. మూఢనమ్మకములుంచుకొనరాదు. సమానత్వ మునకు, సర్వమానవవిముక్తికి శంకర రామానుజ చైతన్యాది మహాపురుషులు చూపిన మార్గముననుసరించి సంఘపున ర్నిర్మాణమునకు ప్రయత్నింపుఁడు.

ఒకలక్ష్యమునుంచుకొని తత్సిద్ధికై ప్రయత్నింపుఁడు. ఇందుకు కృషి అవసరము. నాయకుఁడగువాఁడు వినయవిధేయ తలు కలిగియుండవలయును. స్వార్థము తగదు. కొండెములు చెప్పువారిని దూరముగనుంచవలయును. అనంతమగు సహన మును గలిగియుండవలయును. అప్పుడు తప్పక కార్యసిద్ధి యగును.

ఒక్కవిషయమును గుర్తుంచుకొనుఁడు. అమెరికనులు చెప్పినట్లు ఇతరులపై నధికారము చెలాయింపఁదలపకుఁడు. నేను ఉత్తరములు మీ పేర వ్రాయుచున్నానని నా యితర స్నేహితులఁ జులకనగఁ జూడకుఁడు. అంత తెలివితక్కువ తనముగా మీరు ప్రవర్తింపరని నాకుఁ దెలియును. కాని మిమ్ము హెచ్చరించుట నా విధి. సర్వవ్యవస్థల నాశము చేయునది యీ దోషమే. ఇతరుల మేలుకొఱకు కృషి చేయుట జీవితపరమార్థము కాన మీరు కృషి చేయవలయును.

నటన, మోసము, దుర్మార్గము నుండరాదని నా కోరిక. నే నెప్పుడును సర్వాంతర్యామిపై, అనంతమగు సత్యముపై నాధారపడియుందును. పేరుప్రఖ్యాతులు సంపాదించుదృష్టితో, నితరులకు మేలుచేయుదృష్టితో నాత్మవంచనకు దిగకుందురుగాక. ధర్మచ్యుతి, చెడుపునకు దారితీయు సిద్ధాంతవ్యత్యయము లేకుండునుగాక.

అనిశ్చితబుద్ధితో, దుర్మార్గమును గప్పిపుచ్చు నుద్దేశముతో దేనినిగాని చేయరాదు. నాయకుని ప్రత్యేకాదరాభిమానములనుపొందు నుద్దేశ్యముండరాదు. నాయకుఁ డున్నాఁడను దృష్టియే యుండరాదు. సోదరమానవుల సాయము, ధనసహాయము నున్నను లేకున్నను లక్ష్యసాధనమే దృష్టిలో నుంచుకొనుఁడు. మీలో ప్రేమ, భగవంతుఁడు నున్నాఁడా? ముందుకు నడువుఁడు. ఎట్టి విరుద్ధశక్తియు మీ కడ్డమురాదు.

కాని ఒక్కమాట! అసత్యము, అశాశ్వతమునగు విషయములకు మనసులో చోటీయకుఁడు. సత్యమునే అంటిపెట్టుకొనుఁడు. నిదానముగనైనను తప్పక మనము జయము పొందఁగలము. 'అహం'ను విసర్జింపుఁడు. మీలో ప్రతివ్యక్తిపై కార్యభారమున్నదని భావించి పనిచేయుఁడు. భారతదేశ భవిష్యత్తు మీపై నాధారపడియున్నది. కృషిచేయుఁడు. నే నెప్పుడు రాగలనో నాకుఁ దెలియదు. కార్యాచరణమునకిచట విస్తృతరంగమున్నది. భారతదేశమున సాధ్యమైనంత

వఱకుఁ బోగడగలరు. కాని దమ్మిడీకూడ నియ్యఁజాలరు. భిక్షుకు లితరులకు దానముచేయుటకు డబ్బెక్కడనుండి తెత్తురు? అందుచే సుమారు రెండువేలయేండ్లనుండి సత్కార్యాచరణముచేయువారు కరవైరి. జాతి, సంఘము ఇత్యాదులను గూర్చిన యోజన లిప్పుడిప్పుడే భారతీయులకుఁ గలుగుచున్నవి. కావున వారిని నిందింపఁదగదు.

మీ కందఱికి నా ఆశీస్సులు.

# భారతదేశమున కార్యాచరణమున కొక ప్రణాళిక*

ప్రేమార్ద్రమగు మనస్సుతో, కృతజ్ఞతాబుద్ధితో, గాఢవిశ్వాసముతో నీకు వ్రాయుటకుఁ బూనుకొంటిని. నేను కలిసికొన్న ఆత్మవిశ్వాసముగల కొద్దిమందిలో నీవొక్కఁడవు. నీలో విజ్ఞానము, భావోద్వేగము సమపాళ్లలో నున్నవి. ఇది చాల అరుదు. దీనితోఁబాటు నీభావములకు రూపుదిద్దఁగల శక్తియు నీలో నున్నది. వీనికి మించి నీవు విశ్వాసపాత్రుఁడవు. అందుచే నా భావముల కొన్నిఁటిని నీకుఁ దెలియఁజేయుచున్నాను.

భారతదేశమున సరియైన పంథాలోనే పని ప్రారంభమైనది. ఈ కార్యాచరణమును విరమింపకుండుటయేగాక యెక్కువ యుత్సాహముతో ద్విగుణీకృతవేగముతో సాగింపవలయును. అందు కిదియే తగినసమయము. విషయముల గూర్చి సమగ్రపరిశీలనచేసి ముందువెనుక లాలోచించిన తరువాత నాదృష్టి క్రిందికార్యక్రమముపై లగ్నమైయున్నది.

---

* తే 3-1-1895 ది చికాగోనుండి యొక ప్రముఖ భారతీయునకు వ్రాసినది.

మొట్టమొదట చెన్నపట్నమున నొక తత్త్వబోధనకళా శాలను స్థాపించి తరువాత క్రమముగా దానిపరిధిని ఎక్కువ చేయవలయును. అందు వేదభాష్యములు, వేదాంతము తోఁబాటు ఇతరమత పరిజ్ఞానమునుగూడ యువకులకు నేర్ప వలయును. ఈ కళాశాలలో వీనితోఁబాటు ఆంగ్లమును, మాతృభాషనుగూడ నేర్పవలయును.

ఇది ఆరంభముమాత్రమే. ఇట్టి చిన్నసంస్థలే క్రమ ముగాఁ బెద్దవియగును. చెన్నపట్నమిప్పుడు ప్రాచీనాధునిక జీవిత దృక్పథముల ప్రశంసించుచు నొక యుత్తమమార్గ మనుసరించుచున్నది.

సంఘ పునర్వ్యవస్థీకరణ మవసరమని నమ్ము భారత దేశములోని విద్యావంతులతో నే నేకీభవించుచున్నాను. కాని అది చేయుట యెట్లు? సంఘసంస్కర్తల ప్రణాళికలు నిష్ఫలమైనవి. నా ప్రణాళికయిది. గతమున మనము చేసిన పని సంతృప్తికరముగా లేకపోలేదు. మన సంఘస్థితి కూడ నంతే. సంఘస్థితి నింకను బాగుచేయుటయే నేఁటికర్తవ్యము. ఈ పని దోషమునుండి గుణమునకు, చెడ్డనుండి మంచికిఁ దెచ్చుటవంటిది కాదు. గుణమునుండి అత్యుత్తమగుణము నకు, మంచినుండి యెక్కువమంచికిఁ దెచ్చుటవంటిది. నా దేశీయు లిదివఱకుఁ గొంతసాధించియున్నారు. కాని యింకను సాధింపవలసిన దున్నదనియే నేను హెచ్చరించుచున్నాను.

ఇఁక కులములసంగతి చూడుము. సృష్టి పరిణామములో జాతి మొదటిది. జాతి యనఁగా సృష్టియని అర్థము. "నే నొక్కఁడను. అనేకమగుదును" (వేదములు). సృష్టికి ముందు ఏకత్వముండినది. అనేకత్వముసృష్టి. అనేకత్వమే లేకపోయినచో సృష్టినాశనమగును. ఏజాతి కాని శక్తిమంతము, ఉత్సాహపూరితము నై నంతవఱకు విభేదత్వముతప్పదు. విభేదత్వము నశించినవెంటనే జాతియు నశించును. వ్యక్తికి స్వేచ్ఛనిచ్చి తద్వారా అతని ప్రకృతిని వ్యక్తీకరించునట్లు చేయుటయే జాతి ప్రధానోద్దేశము. అందుచేతనే ఆవ్యవస్థ వేలకొలఁది సంవత్సరములు నిలిచియుండినది. వేదముల తరువాత వెలువడినగ్రంథములందెచ్చటను నేకపంక్తి భోజనము నిషిద్ధముకాలేదు; వర్ణాంతర వివాహములు పనికిరావని చెప్పలేదు. కాని భారత దేశపతనమునకుఁ గారణమేమి? — జాతి యెడ నీయుద్దేశ్యము మారుటయే. జాతి రూపుమాసినప్పుడే ప్రపంచము నాశనమగునని భగవద్గీత చెప్పుచున్నది. విభేదత్వము సమసిపోవుటచే ప్రపంచము నశించుననుమాట సత్యమని నేఁడు తోఁచుచున్నది. నేఁటి కులము నిజమైనజాతి గాదు; అది అభివృద్ధినిరోధకమైనది; విభేదత్వమునకు నాటంకమై నిలిచినది. పరంపరానుగతమగు నే కులముగాని, యాచారముగాని, అవకాశముగాని అభివృద్ధినిరోధకమే. కావున నా దేశీయులకు నేను చెప్పున దేమన : మీరు కులమును

లేకుండఁ జేసితిరి కావుననే భారతదేశము పతనమైనది. కరుడు గట్టిన ధనికవర్గము నిజమైనజాతిగాదు; జాతికే తీరని దెబ్బ. జాతిని సార్థకార్థములో నభివృద్ధికానిండు. కట్టు దిట్టములకు స్వస్తిచెప్పుఁడు. అప్పుడే మనకు పురోగతి. యూరోపును పరిశీలింపుఁడు. జాతికి స్వేచ్ఛనిచ్చి వ్యక్తికి వ్యక్తికి మధ్యఁ గల విభేదమునశించి తనదారిని తాను పురోగమించినంతనే యూరోపు అభివృద్ధిచెందినది. నిజమైనజాతి అభివృద్ధిచెందు టకు అమెరికాలో సంపూర్ణావకాశముగలదు. అందుచే నచ్చటి వారు గొప్పవారైనారు. బిడ్డపుట్టినంతనే జ్యోతి ష్కులు కులనిర్ణయముచేయుదురను విషయము ప్రతి హిందు వునకుఁ దెలియును. అదే నిజమైనజాతి; వ్యక్తిత్వము. జ్యోతిష మీా విషయము నంగీకరించుచున్నది. దాని అభివృద్ధికి దోహదముచేసినచో మనము పునరుద్ధరింపఁబడుదుము. ఈ విభేదత్వమునకు అసమానత్వము, ప్రత్యేకావకాశమునని అర్థము కాదు.

మనము వదలుకోవలసినదేమియు లేదని, శతాబ్దుల దాస్యఫలితముగ మనలోనేర్పడిన స్తబ్ధతనుండి విముక్తులమై ప్రాచీనర్షులు చూపిన త్రోవను పురోగమించుటయే మన కర్తవ్యమని చూపుటయే నాపని. జీవన్మరణ సమస్యలోఁ జిక్కుకొని మహమ్మదీయ క్రూరపరిపాలనమున నభివృద్ధికి నిరోధమేర్పడినమాట నిజమే. ఆయొత్తిడి యిప్పుడు లేదు

కాన మతావేశపరులు, మతవిశ్వాసములేనివారు సూచించు నభివృద్ధి నిరోధకమగు మార్గమునఁగాక మన సొంతమార్గమున మనము అభివృద్ధినిసాధింపవలయును. మనకింకను లక్ష్యసిద్ధికాలేదు కాబట్టి అంతయు నవ్యక్తముగనే యున్నది. వందలకొలఁది యేండ్లు పరపాలనక్రింద నుండుటచే లక్ష్యమును సాధింపలేక పోతిమి. లక్ష్యమును సాధింపుఁడు. అప్పుడు సర్వము సర్వాంగసుందరమై భాసిల్లఁగలదు. నాయీ ప్రణాళికయందు సంపూర్ణవిశ్వాసము గలదు. ప్రతిదేశమునకు జీవితమునకు నొకలక్ష్యముండును. భారతదేశమునకు మతము లక్ష్యము. దీని నభివృద్ధిచేయుఁడు. మన కృషి సర్వమిందుకుఁ దోడ్పడునదిగా నుండవలయును. ఇది నాప్రణాళికలోని యొక భాగముమాత్రమే. సమయము వచ్చినప్పుడు సర్వము మీ ముందుంచుదును. ప్రస్తుత మీదేశమందును నాకర్తవ్యము కొంచెమున్నదని నేను భావించుచున్నాను. అంతేకాక ఈ దేశీయులనుండి మాత్రమే మనకు కొంతసహాయము లభింపఁగలదని ఆశించుచున్నాను. కాని నేఁటివఱకు నా ఆశయములఁ దెలియఁజేయుటతప్ప నేనేమియుఁ జేయలేకపోతిని. ఇట్టి ప్రయత్నమే భారతదేశమందును జేయవలయునని నాకోరిక.

భారతదేశమునకుఁ దిరిగి యెప్పుడు వత్తునో నాకుఁ దెలియదు. భగవదిచ్ఛనుబట్టి నేను నడచుచున్నాను. నేనతని చేతిలోని కీలుబొమ్మను.

"భగవంతుఁడా, ఈ ప్రపంచమున ధనాన్వేషణ చేయుచు ననర్ఘమ రత్నమగు నిన్నుఁ గనుఁగొంటిని. నా సర్వము నీ కర్పించుచున్నాను."

"ప్రేమపాత్రమగు వ్యక్తికొఱ కన్వేషించుచు ప్రేమ మూర్తివగునిన్నుఁ గనుఁగొంటిని. నన్ను నీకర్పించు చున్నాను."

(యజుర్వేద సంహిత)

భగవంతుఁడు నిన్నెల్లప్పుడు రక్షించుఁగాక !

# నవభారతసమస్య - తత్పరిష్కారము*

భారతదేశ ప్రాచీనచరిత్ర ప్రకృతి మహాశక్తులు, వాని పనితనము, అనంతాత్మ, వివిధశక్తులమధ్య నెడతెగక జరుగు ఘర్షణము, తత్ఫలితములు, ధ్యానమగ్నమగుఋషులు మున్నగువాని వర్ణనలతో నిండియున్నది. రాజులు, చక్రవర్తులు మున్నగువారి వంశక్రమములు, సంఘ చిత్రణము—పాలకుల అరిషడ్వర్గమునకు గుఱియై సంఘముపడిన బాధలు, దుష్టాదుష్టస్వభావములచే వారుచేసిన పనులు, సంఘముపై వానికిఁగల ప్రభావము — మున్నగునవియే చరిత్రయైనచో నట్టి చరిత్ర భారతదేశమునకు లేదు. భారతదేశ అధ్యాత్మ సారస్వతము, కవిత్వము, వేదాంతము, శాస్త్రగ్రంథములు నేఁటి చరిత్రలుసైతము చేయలేనిపనిని చేయుచు నిజస్థితిని వర్ణించుచున్నవి. అంతేకాక నాగరకత వ్యాప్తిచెందక పూర్వమే అప్పటివారు కామక్రోధాదులకు గుఱియై, సౌందర్యారాధకులై, అసాధారణబుద్ధికౌశలముగలవారై, వివిధ

---

* 14-1-1899 ని రామకృష్ణమిషనువారు ప్రారంభించిన 'ఉద్బోధన' అను పక్షపత్రిక (తరువాత మాసపత్రిక)కు నుపోద్ఘాతరూపముగ వివేకానందులు వంగభాషలో వ్రాసిన వ్యాసమున కాంగ్లానువాదము. (అందుండి యిది ఆంధ్రీకరింపఁబడినది).

భావములచేత నుద్రిక్తహృదయముగలవారై వివిధదశా పరిణామముచెంది క్రమముగా నెట్లున్నతస్థాయినందుకొన్న దియు వానివలన మనకుఁ దెలియును. అనేకయుగములుగ ప్రకృతి నెదుర్కొని వారు సాధించిన ఘన విజయములు ఇటీవలి వ్యతిరేక వాతావరణముచే నశించినవి. కాని ఆ విజయములు నేఁటికిని ప్రాచీన భారతీయవైభవమును జాటుచునేయున్నవి.

ఈజాతి మధ్యఆసియా, ఉత్తరఐరోపా, ఆర్కిటిక్ వలయ ప్రాంతమునుండి క్రమముగా భారతదేశము వచ్చి అచ్చట స్థిరనివాసమేర్పఱచుకొని దానిని పవిత్రముచేసిరో లేక పవిత్రభారతదేశమే మొదట వారి నివాసస్థలమో లేక భారతదేశమందును, తత్పరిసరములందును నొక గొప్పజాతి నివసించియుండి ఆజాతియే యూరోపు మున్నగు ప్రదేశము లందు వలస లేర్పఱచుకొనిరో, వారి తలవెంట్రుకలు, కను బొమలు నెట్లుండినవో చెప్పుటకుఁ దగిన యాధారములు లేవు. కాని ఒక్కవిషయము మాత్రము స్పష్టము. సంస్కృత భాషకుఁగొన్ని ఐరోపీయభాషలకు సమానలక్షణములున్నవి. అట్లే నేఁటి భారతీయులందఱు ఆజాతికిఁ జెందినవారేనా? అయి నచో ఆజాతి రక్తము వీరిలో నెంతవఱకున్నది? ఎవరెవరిలో నున్నది? అను ప్రశ్నలకుఁగూడ జవాబిచ్చుట కష్టమే.

ఈ ప్రశ్నలు తేలకున్నచో మనకువచ్చు నష్టము లేదు.

కాని ఒక్కటిమాత్రము సత్యము. నాగరకతా విజ్ఞానములు మొట్టమొదట వ్యక్తమైన ఆ ప్రాచీన భారతజాతి వారసులు, ఆజాతి మేధాసంపత్తిని, భావములను తమలోఁ గలిగియున్న వారు లక్షలకొలఁది యింకను నున్నారు.

భారతీయవిజ్ఞానము దేశకాలావధులనుదాఁటి వ్యక్తావ్యక్త మార్గమున ప్రపంచములోని యితరజాతుల నాడులలో ప్రవేశించినది. ఇట్టి అపూర్వావకాశము ఒక్క మన జాతికే కలిగినది.

మధ్యధరాసముద్రము నానుకొని ప్రకృతిసౌందర్యముతో నలరారుచుఁ జూడ ముచ్చటగొలుపు ద్వీపసముదాయమును హారముగఁ గలిగియున్న యొక చిన్నిదేశమున, నాకర్షణీయమగు నాకారము, సమకాయము, బలిష్ఠమగు కండరములు, చురుకైనదేహము, లక్ష్యశుద్ధి, పట్టుదల, అద్భుతమగు సాధనశక్తి, నైపుణ్యము, సౌందర్యకల్పనాబలము గలిగిన అల్పసంఖ్యాకమగు నొకజాతి నివసించుచుండెను. ఇతర ప్రాచీనజాతులు వారిని యవనులనిరి. కాని వారు తాము గ్రీకులమని చెప్పుకొనిరి. మానవజాతి చరిత్రలోనే వీరికి సమాన మెవరునులేరు. ఎచ్చటనైనను, ఏ జాతిచేతనైనను భౌతికశాస్త్రములలో—సాంఘిక, రాజకీయశిల్పాది శాస్త్రములలో — నేఁటివఱ కెట్టి యభివృద్ధి సాధింపఁబడియున్నను అచ్చట గ్రీకుప్రాబల్య మేదోయొకవిధముగ నున్న

దనియే చెప్పవచ్చును. ప్రాచీనకాలము నటుంచి కడచిన యేఁబదియేండ్లుగా వంగదేశీయులమగు మనము సగర్వముగా యవనుల గురువులనుగా భావించి వారి యడుగుజాడలలో నడచుచు ఐరోపీయ సాహిత్యముద్వారా లభించు గ్రీకు విజ్ఞానదీప్తులచే ప్రజ్వరిల్లుచున్నాము.

నేఁటి ఐరోపాఖండము మొత్తము ప్రాచీన గ్రీకులకు ఋణములఁ బుణికిపుచ్చుకొన్నదనవచ్చును. అందుచేతనే ఆంగ్ల విజ్ఞాని యొకఁడు 'ప్రకృతి సృష్టింపనిదానినంతయు గ్రీకుమేధ సృష్టించిన' దన్నాఁడు.

పరస్పరసామీప్యములేని గ్రీసు, భారతదేశములందుద్భవించిన మహత్తరమగు నీ రెండు ప్రవాహము లప్పుడప్పుడు కలిసెడివి. అట్టి సమ్మేళనము జరిగినపుడు అత్యద్భుతమగు మానసికాధ్యాత్మికతరంగములలో నేదే నొకటి మానవసంఘములందు బయలుదేఱి నాగరకత నెక్కువగ వ్యాప్తినొందించి సర్వమానవసౌభ్రాతృత్వ ముత్తమమని చాటెడిది.

అతిప్రాచీనకాలమున నొక్కమారు భారతీయవేదాంతము గ్రీకుశక్తితో సంబంధముగలిగినదై పర్షియను, రోమను మున్నగుజాతుల ప్రాభవమునకు దారితీసినది. అలెగ్జాండరు దండయాత్రతో నీ రెండుప్రవాహము లొకదానినొకటి

యెదుర్కొని దాదాపు సగము ప్రపంచమును క్రైస్తవాది మతములచే ముంచెత్తినవి. అట్టి సమ్మేళనమే అరేబియా అభివృద్ధి ప్రాభవములకుఁ దోడ్పడి నేఁటి ఐరోపీయ నాగరికతకుఁ బునాదియైనది. నేఁడు సైతము ఈ ప్రబలశక్తులు రెంటికి సమ్మేళనావకాశము కలిగినది. ఈ సమ్మేళనమున కిప్పుడు భారతదేశము స్థానమయినది.

భారతదేశవాతావరణము ప్రశాంతతకుఁ దోడ్పడును. బలమును, శక్తిని బహిర్గతమొనర్చుట గ్రీసుదేశనైజము. ధ్యానమగ్న మొకదాని స్వభావము; ఉత్సాహము తోడి కార్యాచరణ మింకొకదాని స్వభావము. త్యాగ మొకదాని యాదర్శము; భోగలాలసత యింకొకదాని లక్ష్యము. ఒకదానిశక్తి అంతర్గతముచేయఁబడినది; ఇంకొక దానిశక్తి బహిర్గతముగావింపఁబడినది. ఒకదాని విజ్ఞానమంతయు నిత్యమగు నాత్మను దెలిసికొనుట కుపయోగింపఁబడినది; ఇంకొకదాని విజ్ఞానము నశ్వరమగు సృష్టిపరిశీలనమునకు వెచ్చింపఁబడినది. ఒకరికి మోక్షాసక్తి; ఇంకొకరికి రాజకీయ స్వాతంత్ర్యాపేక్ష. ఒకరి కిహమున మహోన్నతస్థితి సాధించుట యిష్టములేదు; ఇంకొక రిహమునే స్వర్గతుల్యముగఁ జేయుటకుఁ బ్రయత్నించిరి. ఒకరు నిత్యమగు బ్రహ్మానంద మందుఁ గోరికచే ననిత్యమగు నిహసుఖముల లెక్కచేయరు; అది లేదని సందేహించియో లేక ఉన్నను దుర్లభమని

భావించిరో యింకొకరు సాధ్యమగునంతవఱ కిహసుఖసాధన మునకుఁ బ్రయత్నింతురు.

ఇప్పు డీ రెండు తెగల మానవులును లేరు. వారి శరీర మనోబలములచే నేర్పడిన గ్రంథములు, భావములుమాత్రము నిలిచియున్నవి.

యూరోపు, అమెరికా ప్రజలు యవనుల వారసులు. తమకు మార్గదర్శకులైన యవనుల గౌరవమును కాపాడిన వారు. కాని నేఁటిభారతీయులు ప్రాచీనార్యుల పేరు నిలుప లేదు.

నివురుక్రింద నిప్పున్నట్లు నేఁటిభారతీయులలో వారి ప్రాచీనుల భావాగ్ని లేకపోలేదు. సర్వశక్తిమంతుఁడగు భగవంతునికృపవలన సమయమువచ్చినపు డది బహిర్గతమై ప్రజ్వరిల్లఁగలదు.

అప్పు డెట్టి ఫలితము గలుగఁగలదో తెలియునా?

వేదమంత్రానుసారము జరుగు హోమాగ్నినుండి వెలువడు ధూమసముదాయము భారతీయాకాశము నావరించునా? లేక యజ్ఞపశువులలో రంతిదేవుని మహిమ తిరిగి బహిర్గతమగునా? గోమేధము, అశ్వమేధము, దేవరన్యాయముచే వంశము నిలుపుట మున్నగు నాచారములు మఱలఁ బాటింపఁబడునా? లేక బౌద్ధమతప్రచారము జరిగి భారతదేశ

మంతయు నొక పెద్దమతముగాఁ దయారగునా? పూర్వము నందువలె మనుప్రతిపాదితములగు సూత్రము లమలులోనికి వచ్చునా? భౌగోళికపరిస్థితుల కనుగుణముగ నేఁడున్న ఆహార విధానమే దేశమంతయుఁ బాటించునా? వర్ణవ్యవస్థ నిలుచునా? నిలిచినచో నది జన్మహక్కుగానా లేక అర్హతనుబట్టియా? వర్ణవ్యవస్థలో నాహారవిషయమున దాని స్పృశ్యతా స్పృశ్యతలు వంగదేశమునవలె దానిని తాఁకు వ్యక్తియొక్క పవిత్రతాపవిత్రతలఁబట్టి యుండునా, లేక మదరాసునందువలె నింకను కఠినవిధానముండునా? లేక పంజాబునందువలె నన్ని నియమములుత్రోసి వేయఁబడునా? మనుస్మృతినాఁటి దినముల లోవలె, నేఁడుసైతము నేపాలునందున్నట్లు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు—ఈ క్రమమున నితరవర్ణములతోఁగూడ వివాహసంబంధములు చేయుదురా? లేక వంగదేశములోను, ఇంకను కొన్నిప్రాంతములలో నున్నట్లు ఒకవర్ణమువారు ఆ వర్ణములోని వివిధశాఖలతోమాత్ర మట్టి సంబంధములు చేయవచ్చునను నియమ మేర్పడునా? ఈ ప్రశ్నపరంపరకు సమాధానమిచ్చుట చాలకష్టము. దేశములోని వివిధభాగ ములయందలి విభిన్నాచారములను—అంతేగాక ఒకప్రదేశము లోని కులములందుమతములందుఁగల యాచారభేదములను— బరిశీలించిన కష్టతరమనికూడఁ జెప్పవచ్చును.

అయినచో ఫలిత మే రూపమున నుండును?

ఇప్పుడు మనకు లేనిది, మన తాతముత్తాతలుసయితము పొందనిది, యవనులు పొందినది, చైతన్యవంతమై విద్యుదుత్పాదకయంత్రమునుండి యుత్పత్తియైన విద్యుత్ప్రవాహము వలె ప్రపంచమునంతటిని నుత్తేజపఱచునది మనకుఁ గావలయును. ఆ శక్తియే, ఆ స్వాతంత్ర్యాపేక్షయే, స్వశక్తిపై నాధారపడియుండు నట్టి స్వభావమే, ఆ స్థైర్యమే, కార్యాచరణమం దట్టి ఆసక్తియే, లక్ష్యమునం దచంచలమగునట్టి విశ్వాసమే మనకుఁ గావలసినది. గతమునే యెల్లప్పుడు స్మరించుట మాని మనదృష్టిని భవిష్యత్తుపై లగ్నముచేయ వలయును. నఖశిఖపర్యంతము ప్రతినాడియందు ప్రవేశించి కార్యోన్ముఖముచేయు రజోగుణము మనకిప్పు డవసరము.

త్యాగముకంటె శాంతినిగూర్చున దేదియున్నది? భౌతికము నశ్వరమునగు చిన్న మంచికార్యమునకు అనంతమగు మంచితో పోలికయే లేదని నిస్సందేహముగఁ జెప్పవచ్చును. సత్త్వగుణముకంటె నెక్కువశక్తిగల దేమున్నది? ఇతరమగు నే విజ్ఞానముగాని ఆత్మజ్ఞానమునకు సరిరాదనుట సత్యమే. కాని ప్రపంచములో నెంతమంది సత్త్వగుణమును సాధింపఁగల రనునదే నా ప్రశ్న. భారతదేశమునమాత్రమెంతమంది యున్నారు? స్వార్థమును పరిత్యజించి త్యాగబుద్ధితో మెలఁగు నుదాత్తస్వభావ మెంతమంది కున్నది?

ప్రాపంచికసుఖములు నిరర్థకములను దూరదృష్టిగల పుణ్యాత్ము లెంతమంది యున్నారు? దేవుని సౌందర్యమును, గొప్పతనమును ధ్యానించుచుఁ దన్నుసైతము మఱువఁగల విశాల హృదయుఁ డెక్కడ నున్నాఁడు? భారతదేశజనసంఖ్యనుబట్టి చూచినచో నట్టివారు వ్రేళ్లమీఁద లెక్కపెట్టఁగల కొద్దిమందియే యున్నారని మనకుఁ దెలియును. వారి ముక్తికొఱకు భారతదేశములోని లక్షలకొలఁది స్త్రీపురుషులు నేఁటిసంఘమునకు, మతమునకు బలి కావలసిన దేనా? అట్టి బలిదానమువలన నెట్టి సత్ఫలితము కలుగఁగలదు? ఇట్టి సత్త్వప్రబోధముచేతనే దేశము నానాఁటికి తమస్సులోఁ—అజ్ఞానాంధకారములోఁ—జిక్కుకొనిపోవుట మీరు చూచుటలేదా? మందబుద్ధులు సైతము శారీరక మానసిక కార్యాచరణమున కతీతమగు బ్రహ్మజ్ఞానమును పొందవలయునను అపోహతోనుండఁగ, సోమరిపోతులు కార్యసాధకశక్తిలేక అట్టి అశక్తతను త్యాగాచరణముచేఁగప్పిపుచ్చుటకుఁ బ్రయత్నించుచుండఁగ, క్రూరులు తమ క్రౌర్యమును మతమున కనుబంధమగు నీతినియమపాలనమున కుపయోగించుచుంటిమను నభిప్రాయముతోనుండఁగ, ఎల్లరును దమయందలి దోషముల గమనింపక యితరులయందలిదోషములనే యెత్తిచూపుటకుఁ బ్రయత్నించుచుండఁగ, పుస్తకముల కంఠస్థముచేయుటయే విజ్ఞానమని, ఇతరుల భావముల పునశ్చరణముచేయుటయే తెలివితేటలకు నిదర్శన

మని, ప్రాచీనుల నామములఁబెట్టుకొనుటచే నున్నతిని బొందఁ గలమని భావించుచుండఁగ దేశము తమస్సుచే నావరింపఁ బడినదనుటకు వేఱు నిదర్శనము లేమి కావలయును?

కావున సత్త్వము—అతిపావిత్ర్యము—నేఁడు మన కందనివస్తువు. పరమహంసస్థితి కిప్పు డర్హులుకాక యిఁక మీఁదట అర్హత సాధింతుమనువారు రజోగుణమును బొందుటయే శ్రేయోదాయకము. రజోగుణమును బొందనివాఁడు సత్త్వగుణము నెట్లు పొందఁగలఁడు? భోగానుభవముచే తృప్తుఁడుకానిదే యోగమును—భగవత్సంయోగమును—ఎవఁడైనను నెట్లు పొందఁగలఁడు? భోగాసక్తి నశించి వైరాగ్యము పొందనిదే త్యాగ మెట్లలవడఁగలదు?

తాఁటియాకు మంటవలె వచ్చిన వెంటనే నశించు స్వభావముగలది రజోగుణము. సత్త్వము, అనంతసత్యము ఒకదానినొకటి ఎడఁబాయకుండును. సత్త్వమే నిత్యమైనదని కూడ ననవచ్చును. రజోగుణప్రధానమగు జాతి త్వరలో నశించుచుండ సత్త్వప్రధానమగునది అనశ్వరమై యున్నది. చరిత్రమే ఈ సత్యమును ఋజువుపఱచినది.

భారతదేశమున రజోగుణము లేదనియే చెప్పవచ్చును. అట్లే పాశ్చాత్యదేశములలో సత్త్వగుణము శూన్యము. కావున భారతదేశమునుండి సత్త్వప్రవాహము వెలువడి

అటు ప్రవహించుటపై పాశ్చాత్యుల నిజమగు జీవన మాధార పడియుండుట సత్యము. అట్లే మనము తమోగుణమును జయించి తద్విరుద్ధమగు రజోగుణప్రధానులము కానిచో జీవితసుఖము మనకుదక్కదు. అంతేకాక పారలౌకికములగు కాంక్షలను, భావములనుగూర్చిన సిద్ధిలో ననేకాంతరాయ ముల మన మెదుర్కొనవలసివచ్చును.

ఈ ద్వివిధశక్తుల సమీకరణమునకుఁ దన శక్తికొలఁది పాటుపడుట 'ఉద్బోధన' లక్ష్యములలో నొకటియై యుండ వలెను.

ఇట్లు చేయుటలో నొక ప్రమాదముకూడ నున్న మాట వాస్తవము. పాశ్చాత్యవాసనోత్తుంగతరంగములచే ననేకయుగముల శ్రమచే సంపాదితమైన అనర్ఘరత్నము లణఁగిపోవచ్చును. భారతదేశము తన్నుఁదానుమఱచి ప్రాపం చిక సుఖముల వెంటఁ బరుగిడవచ్చును. మన జాతీయాచార సంప్రదాయముల విస్మరించి ఆచరణసాధ్యముగాని విదేశ మార్గముల ననుసరించుటకు ప్రయత్నించవచ్చును. అందుచే మనకు ప్రియమగువానిని ఈ జన్మమందేకాక తరువాతి జన్మ లలోఁగూడ సాధింపలేక పోవుదుము.

ఇట్టి దురంతములు కలుగుటకుఁ జోటీయక ప్రతి వ్యక్తియుఁ దన ప్రాచీనులు సాధించినదానిని జూచునట్లు మన మూలధనము కనుమఱఁగిపోకుండఁ గాపాడవలయును.

ఈపనిచేయుచు విజాతీయ తేజస్సును మనకులభ్యమైనవఱకు పొందుటకు సిద్ధపడవలయును. ప్రపంచము నలుమూలలనుండి యట్టి కాంతి కిరణములు ప్రవేశించునుగాక! అట్లే పాశ్చాత్య దేశములనుండియు వచ్చును గాక! దానివలన నష్టమేమి? బలహీనము, సంకుచితమునగునది నశించిపోవును. దానిని మనమేమి చేయఁగలము? పోవునది తప్పకపోవును. అందు వలనఁ గలుగు ప్రమాదమేమి? శక్తిమంతము, నుత్సాహ పూరితమునగు దానికి నాశము లేదు. దాని నెవరు నాశము చేయఁగలరు?

ఎన్ని జలపాతములు, ఎన్ని మంచుకాలువలు, ఎన్ని ఉపనదులు చేరి దేవనది – గంగానది యై – సముద్రమువైపు పరుగిడుచున్నదో చూడుఁడు! అట్లే ఎన్నో విభిన్న భావములు, ఆదర్శములు, శక్తులు వివిధ దేశములలోని ఋషితుల్యులగు వారి హృదయమునుండి, మేధాసంపన్నుల మనస్సునుండి యుద్బుద్ధమై, మానవశక్తిసామర్థ్యములు ప్రదర్శింపఁగలరంగమై కర్మభూమియగు భారతదేశమును అప్పుడే ఆవరించినవి. విద్యుచ్ఛక్తి, ధూమశకటములు, ఆవిరియంత్రములు విరివిగాఁ గల ఈ యాంత్రికయుగములో ఆంగ్లపాలనమున విద్యోద్యోగ ముతో వివిధసంప్రదాయములు, అభ్యాసములు, ఆచార ములు, ధర్మములు నెట్లు వ్యాప్తిచెందుచున్నవో చూడుఁడు! గుణమును దోషము, అమృతమును విషము వెన్నంటివచ్చు

చున్నవి. వీనికి వలసినంత ప్రతిఘటనము, రక్తపాతము జరిగినది. దీనిని నిర్మూలించుశక్తి హైందవసంఘమునకు లేదు. మాటలలోనున్న ప్రతిఘటన చేఁతలలో లేదు. యంత్రములచే పరిశుభ్రముచేయఁబడిన నీరు మొదలు, ఎముకలపొడిచే శుద్ధి చేయఁబడిన చక్కెరవఱకు ప్రతివ్యక్తియు నిరాఘాటముగ వాడుచునే యున్నాఁడు. శాసనముల ధాకకుఁ దాళలేక మన ముఖ్యాచారములు నానాఁటికి నశించిపోవుచున్నవి. ఆ శాసనముల కెదురొడ్డి నిలువఁగలశక్తి మనకు లేదు. ఎందుకు లేదు? సత్యము నిజముగా బలహీనమైనదా? "సత్యమేజయించును; అసత్యముగాదు" అను వేదవాక్కు అబద్ధమా? పాశ్చాత్య సార్వభౌమాధికారముచే, పాశ్చాత్య విద్యావిధానముచేఁ దుడచివేయఁబడుచున్న ఆ ఆచారములు సదాచారములుగాక అనాచారములేమో ఎవరుచెప్పఁగలరు? ఈవిషయమునుగూడ మనము దీర్ఘముగ నాలోచింపవలయును.

"బహుజనహితాయ బహుజన సుఖాయ"—అందఱి మంచికి, అందఱి సౌఖ్యమునకు నిస్స్వార్థమగు విధమున భక్తి ప్రేమలతో నిండిన హృదయముతో దేశభక్తిగల విశాల హృదయులను, బుద్ధిమంతులను ఈ విషయములఁగూర్చి చర్చించి సమస్యలపరిష్కరించుటకు "ఉద్బోధన" ఆహ్వానించుచున్నది. ఏవ్యక్తియెడఁగాని, సంఘమునెడఁగాని, శాఖయెడఁగాని అసంబద్ధములగు మాటలనుపయోగింపకుండుటయే

కాక ద్వైతభావమునుగాని, వ్యతిరేకభావమునుగాని చూపక తన సర్వస్వము అందఱిసేవకై యర్పించుచున్నది.

కర్మాచరణము మనవిధి; తత్ఫలితము దైవాధీనము. "ఓ అనంతాత్మా! మమ్మాధ్యాత్మాసక్తుల చేయుము. ఓ సర్వశక్తిస్వరూపా! మమ్ము శక్తిమంతులఁ జేయుము. ఓ మహాత్మా! మమ్ము మహనీయులఁ జేయుము" అనియే మనము ప్రార్థింతుము.

# భారత దేశమున కవసరమగు విద్యావిధానము*

కార్యాచరణవిధానమునుగూర్చిన నీ ప్రశ్నకు సమాధానముగ నేను ముఖ్యముగా నొక విషయమును జెప్పుచున్నాను. ఉద్దేశించిన ఫలితముల సాధించువిధముగా మనము కార్యమును ప్రారంభించి కొనసాగింపవలయును. నీ ఉదారస్వభావమునుగూర్చి, నీ దేశాభిమానమునుగూర్చి, అచంచలమగు నీ కార్యదక్షతనుగుఱించి నా స్నేహితురాలు మిస్ ముల్లరు ఎక్కువగాఁ జెప్పినది. ఇఁక నీ ప్రజ్ఞావిశేషములకు ప్రత్యక్షసాక్ష్యములుండనేయున్నవి. అల్పజ్ఞుఁడనగు నా ప్రయత్నములను, ఉద్దేశములను దెలిసికొనవలయునను కుతూహలము నీలోనుండుట నాభాగ్యముగా భావించుచు వానిని నా చేతనైనంతవఱకు నీకుఁ దెలుపుచున్నాను. కాని మొదట నా స్థిరసంకల్పములనుమాత్రమే నీ ముందుంతును.

మనమెప్పుడును బానిసలుగనేయున్నాము. పరంపరాగతమగు తమ అంతరాత్మ ప్రబోధముల వ్యక్తపఱచు నవ

---

* తే 24-4-1897 దిన డార్జిలింగునుండి శ్రీమతి సరళాఘోశల్ బి. ఏ. గారికి వ్రాసిన ఉత్తరమునుండి ఉద్ధృతము, వంగమాతృకకనువాదము.

కాశము భారతదేశములో సామాన్యప్రజానీకమున కెప్పు డును లేదు. కడచిన కొన్నిశతాబ్దములుగ పాశ్చాత్యులు స్వాతంత్ర్యసాధనకు శీఘ్రగతిని పురోగమించుచున్నారు. భారతదేశమున నన్నివిషయములకు – తుదకు భోజనవిషయమునఁగూడ – రాజే నిర్ణేతగనుండెను. కాని పాశ్చాత్యదేశములలో ప్రజలే తమ యవసరముల నిర్ణయించుకొందురు.

నేఁడు సాంఘికవిషయములలో రాజు చెప్పఁదగిన దేమియులేదు. నేఁటికిఁగూడ భారతీయులలోఁ గొంచెమైనను ఆత్మవిశ్వాసము గలుగలేదు. ఇఁక స్వశక్తిపై వారెట్లాధారపడఁగలరు? వేదాంతమునకు మూలమగు నాత్మవిశ్వాసము వీరిలోఁ గొంచెమైనను ననుభవమునకు రాకున్నది. అందుచే నొక విషయమునుగూర్చి చర్చించి అభిప్రాయముల సేకరించి తదనుగుణముగ దానిని సాధింపవలయునను పాశ్చాత్యవిధాన మీదేశమున నిరర్థకమేయగును. ఈ కారణముచేతనే విదేశపాలనక్రింద నెట్టి మార్పునుగాని పొందనట్లు మనము కన్పట్టుచున్నాము. ఇది నిజమైనచో బహిరంగ చర్చలవలన ఘనకార్యముల సాధింపఁజూచుట వ్యర్థప్రయాసయే యగును. శిరసే లేనపుడు శిరోవేదనకు స్థానమేది? ప్రజానీక మెక్కడున్నారు? మనము చాల బలహీనులమైయుండుటచే దేనిని గూర్చియైనను చర్చించుటకుమున్నే ఉన్న కొద్దిబలముకూడ లేకుండఁబోవుచున్నది. కార్యదక్షత యెవరికిని లేకున్నది.

ఇందుచేతనే 'మాటలు గొప్ప, చేఁతలు శూన్యము' అని వంగదేశీయులు చెప్పుచుందురని నేను భావించుచున్నాను. ఇఁక రెండవది ధనికవర్గము; వారేమైనను జేయగలరను నాశ నాకులేదు. కావున మనము ఆశపెట్టుకొనియున్న యువకులతోఁ గలిసి నిరాడంబరముగా, ప్రశాంతముగా, లక్ష్యశుద్ధితోఁ బనిచేయవలయును.

ఇఁక కార్యవిధానమునుగూర్చి: విద్యాసంస్కృతులు మున్నగునవి, భూస్వాములనుండి, జమీందారులనుండి సామాన్య ప్రజానీకమునకు వ్యాపించినప్పటినుండి పాశ్చాత్య దేశములలోని నవనాగరకతకు, హిందూదేశము, ఈజిప్టు, రోము మున్నగువాని ప్రాచీన నాగరకతకు విభేదమేర్పడినది. విద్యావివేకములు సామాన్యప్రజలలో నెంత వ్యాపించిన నాజాతి యంత పురోగతిని సాధింపఁగలదను విషయమును నేను కన్నులారఁ జూచుచున్నాను. విద్యావివేకము లేకొద్దిమంది చేతులలోనోయుండుటయే భారతదేశపతనమునకు ప్రధాన కారణము. మనజాతి మఱల పునరుద్ధరింపఁబడవలయునన్న సామాన్యప్రజలలో విద్యావ్యాప్తి కావలయును. గతార్ధశతాబ్దముగ సంఘసంస్కారమునకు పెక్కు ప్రయత్నములు జరిగినవి. కడచిన పదియేండ్లు భారతదేశములోఁ బెక్కుచోటుల సంచరించి దేశమంతయు సంఘ సంస్కరణసభలచే నిండియున్నదని గ్రహించితిని. కాని ఎవరిరక్తమును పీల్చి

ప్రజలు పెద్దమనుష్యులుగాఁ జెలామణియగుచున్నారో వారి
కాసంఘములలోఁ దావు లేదు. ముసల్మాను లెంతమంది సైని
కులను దెచ్చుకొనిరి? సైన్యములో నాంగ్లేయు లెంతమంది
యున్నారు? డబ్బుకాశపడి సోదరులను, తండ్రులను జంపఁగల
వారు లెక్కకుమిక్కుటముగా నొక్క హిందూదేశమునఁదప్ప
మఱెక్కడ లభింపఁగలరు? ఏడువందల యేండ్ల మహమ్మదీయ
పాలనలో నరువదిలక్షుల మహమ్మదీయులు, నూఱేండ్ల ఆంగ్ల
పాలనలో నిరువదిలక్షుల క్రైస్తవులు సైన్యములోఁ బనిచేసిరి.
దీని కర్థమేమి? దేశమున ప్రతిభ యేల మటుమాయమైనది?
ఐరోపీయులతో పోటీకి నిలువలేక నానాఁటికి మన కళాకారు
లేల నశించుచున్నారు? పారిశ్రామిక రంగమునఁ దన కెదురు
లేక అనేకశతాబ్దులుగ తిష్టవేసి కూర్చున్న ఆంగ్లశ్రామికుని
జర్మనుశ్రామికుఁ డెట్లు కాలఁదన్నఁగలిగెను?

విద్య, విద్య, విద్యయే దీనికి కారణము. యూరోపు
లోని వివిధనగరములఁ దిరుగుచు అందు బీదప్రజలకుఁగల
విద్యాసౌకర్యములు గమనించినపుడు మనదేశములోని బీద
ప్రజలస్థితి నాకన్నులకుఁగట్టి కన్నీరుకార్చెడివాఁడను. ఈభేద
మెందు కేర్పడినది? విద్యచేత. విద్యవలన నాత్మవిశ్వాసము,
ఆత్మవిశ్వాసముచే నజ్ఞాతముగనున్న బ్రహ్మము, వారిలో
రేకెత్తుచుండ మనలోని బ్రహ్మము స్తబ్ధమైయున్నది.
ఐరిషుప్రజలు స్వదేశమున నెట్టి ఆస్తిపాస్తులులేక నిష్ప్ర

హ్యులై అనాగరికులగువారు వింతదృక్కుల ప్రసరించుచు ఒక కట్టఱకుఁ జిఱిగినగుడ్డల మూటను దగిలించుకొని భయముతో నటునిటు చూచుచు నడచుట న్యూయార్కు పట్టణమున నేను చూచుచుందును. ఆఱునెలలతరువాత వారే పట్టణవీథులలో నిర్భయముగా మంచి దుస్తులధరించి తిరుగుచుందురు. వారి చూపులయందుఁగాని, నడకయందుఁగాని భయసందేహములు కన్పట్టవు. ఇందుకుఁ గారణమేమి? మన వేదాంతమిట్లు సమాధానము చెప్పుచున్నది—ఐరిషు దేశీయుఁడు స్వదేశమున నిరాశాజనకమగు వాతావరణమున నున్నాఁడు. సర్వ ప్రకృతియు నేకకంఠముగ "ఓయీ! నీతలవ్రాఁతయింతే. నీవు బానిసగా పుట్టితివి, బానిసగానే జీవింపఁగలవు" అని గొంతెత్తి చెప్పుచున్నది. పుట్టినప్పటినుండి యిట్టి వాతావరణమునఁ బెరుగుటచేఁ దాను నిజముగ నల్పుఁడనే యేమో అని భ్రమలోనుండుటచే నతనిలోన బ్రహ్మము ప్రకాశింపలేదు. అట్టివాఁడమెరికాలో నడుగిడినంతనే 'ఓయీ! నీవును మావలె మానవుఁడవే. మానవుఁడే సర్వము సాధించినాఁడు. మనవంటి మానవు లేపనినైనను జేయఁగలరు. ధైర్యముతోనుండుము' అని నలువైపులనుండి ప్రబోధమతని చెవులఁబడుచున్నది. ఈ ప్రబోధముచే నతఁడు మేల్కొన్నవాఁడై తలయెత్తిచూచి యది నిజమే అని భావించినాఁడు. అతనిలోని బ్రహ్మము జాగృతమైనది. అచ్చటి ప్రకృతియు 'లెమ్ము, నిద్రమేలు

కొమ్ము, గమ్యము చేరువఱకు ప్రయత్నము మానుకొనకుము' అని చెప్పినది.

అదేవిధముగ మనబాలురు నేర్చుకొనుచున్న విద్యయు నిరుత్సాహప్రదాయిగానున్నది. బడికిఁ బోవు బాలుఁ డేమియు నేర్చుకొనక వికలహృదయుఁడగుచున్నాఁడు. తత్ఫలితముగ శ్రద్ధనశించుచున్నది. వేదములు, వేదాంతము ముఖ్యావసరమని చెప్పుచున్న శ్రద్ధ, యము నెదుర్కొని ధిక్కరించు ధైర్యమును నచికేతునకిచ్చిన శ్రద్ధ, ప్రపంచ గమనమునకు కారణమగు శ్రద్ధ — ఆ శ్రద్ధయే నశించుచున్నది. "అజ్ఞశ్చా శ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి"— అజ్ఞాని, శ్రద్ధాళువు కానివాఁడు, సందేహప్రాణి నాశము చెందును. కావున మనము పతనావస్థకుఁ జేరువ నున్నాము. విద్యావ్యాప్తియైనచో మనము దీనినుండి బయటఁబడఁగలము. మొదట ఆత్మజ్ఞానము కలుగవలయును. ఆత్మజ్ఞాన మన్నంతనే స్ఫురించు జడలు, యోగదండము, కమండలము, గుహాలు మున్నగువానిని దృష్టిలోనుంచుకొని నే నీ మాట చెప్పుట లేదు. ఐనచో నా ఉద్దేశమేమి? ఐహికబంధములఁ ద్రెంచుట కుపయోగపడు జ్ఞానము భౌతికాభ్యున్నతికిఁ దోడ్పడఁజాలదా? తప్పక తోడ్పడును. స్వేచ్ఛ, నిష్పక్షపాతము, త్యాగము— ఇవన్నియు నత్యుత్తమాదర్శములు. 'స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్'—కొద్ది ధర్మమైనను (జీవన్మరణ)

మహాభయమునుండి రక్షించును. భారతదేశమునందలి యే శాఖకుఁజెందినవాఁడైనను—ద్వైతుఁడు, అద్వైతుఁడు, శైవుఁడు, వైష్ణవుఁడు, శాక్తేయుఁడు తుదకు బౌద్ధుఁడు, జైనుఁడు మొదలగువారైనను—జీవాత్మలో ననంతశక్తులు గుప్తమైయున్నవని యనుకరించును. పిపీలికాదిమానవపర్యంతము బాహ్యాకారమున భేదమున్నను ఆత్మలో భేదము లేదు. "కృషీవలుఁడు (జలమార్గమునకుఁగల) అడ్డంకులఁ దొలఁగించునట్లు" (పతంజలి యోగసూత్రము, కైవల్యపాదము 3). అవకాశము కలిగినపుడు దేశకాలయోగ్యతలనుబట్టి ఆ శక్తి బహిర్గతమగుచుండును. పిపీలికాదిబ్రహ్మపర్యంతము ఒకేవిధమగు నాత్మశక్తి వ్యక్తావ్యక్తముగనుండును. ఇల్లిల్లు తిరిగి మన మా శక్తిని జాగృతము చేయవలయును.

దీనితోఁబాటు విద్యావ్యాప్తికిఁగూడ కృషి చేయవలయును. మాటలు చెప్పుట సులభమే. కాని ఆచరణ సాధ్యము చేయుటెట్లు? స్వార్థరహితులు, దయార్ద్రహృదయులునై సర్వసంగపరిత్యాగము చేసినవారు మన దేశమున పెక్కురున్నారు. వారు దేశము తిరుగుచు తృణము నాశింపక మతవిషయముల బోధించుచున్నారు. అందులో సగముమందినైనను మనకవసరమగు విద్యను వ్యాప్తి చేయు నుపాధ్యాయులనుగాఁ దయారుచేయవచ్చును. ఇందుకై ప్రతిరాష్ట్ర ముఖ్యపట్టణమున నొక కేంద్రమును స్థాపించినచో క్రమముగా

భారతదేశమంతట నట్టివాని నెక్కువగా స్థాపింపవచ్చును. ఇప్పుడు మదరాసు, కలకత్తానగరములలో రెండు కేంద్రములు స్థాపింపఁబడియున్నవి. అట్టి వింకను నెలకొనఁగలవను నమ్మక మున్నది. అప్పుడు విద్యలోఁ జాలభాగము బహిరంగోపన్యాస ములద్వారా బోధింపవచ్చును. పాఠశాలల స్థాపించుట కింకను ననుకూలసమయము రాలేదు. క్రమముగా నీ ముఖ్య కేంద్రములలో వ్యవసాయము, పరిశ్రమలు మున్నగునవి నేర్పవచ్చును. పరిశ్రమాభివృద్ధికై కర్మాగారములుసయితము స్థాపింపవలయును. ఇం దుత్పత్తియైన వస్తువులను యూరోపు, అమెరికాలలో నమ్మట కిప్పుడున్న సంస్థలవంటివి నెలకొన వలయును. మగవారివలె స్త్రీలకుఁగూడ నట్టి కేంద్రముల స్థాపించుట యవసరము. కాని మనదేశమున నట్టివి స్థాపిం చుట యెంతకష్టమైనపనియో నీకుఁ దెలియును. 'కఱచినపామే తనవిషమును గ్రహించి తీసివేయవలయును'. ఇది తప్పక సంభవింపఁగలదని నాగాఢవిశ్వాసము. ఈ కార్యముల కవసర మగు ద్రవ్యము పాశ్చాత్యదేశములనుండి లభింపవలయును. అందుకొఱకై మన మతమును యూరోపు, అమెరికాలలో ప్రచారముచేయవలయును. ఆధునికశాస్త్రవిజ్ఞానము క్రైస్తవ మతమువంటి మతముల పునాదులను బెకలించినది. అంతే కాక భోగలాలసత మతభావముల నశింపఁజేయు ప్రమాదము కూడ నున్నది. ఇట్టి తరుణమున యూరోపు, అమెరికాలు

తమ ఆశాపూరితదృక్కుల భారతదేశమువైపు సారించినవి. వదాన్యతచూపుటకు, పరబలస్థానముల నాక్రమించుటకు నిదే యదను.

పాశ్చాత్యదేశములలో స్త్రీలే పరిపాలకులు. శక్తి ప్రాబల్యములువారిచేతులలోనున్నవి. వేదాంతము చక్కఁగా నెఱిఁగి, ధైర్యము, ప్రజ్ఞ గల నీవంటిస్త్రీలు ఇంగ్లండువెళ్లి బోధించినచో వందలకొలఁది స్త్రీపురుషులు భారతదేశ మతమును స్వీకరించి పవిత్రీభూతులు కాఁగలరని నొక్కి చెప్పఁ గలను. మన భారతదేశమునుండి యట్లు వచ్చిన స్త్రీ ఒక రామభాయ్ మాత్రమే. ఆంగ్లమునందు, పాశ్చాత్యశాస్త్రము లందు, కళలయందు ఆమెకుఁగల విజ్ఞానము పరిమితమైనది. కాని ఆమె అందఱిని ఆశ్చర్యచకితులఁ గావింపఁగలిగినది. ఇఁక నీవంటివారు వచ్చినచో ఇంగ్లండున సంచలముకలుగఁగల దన్నచో అమెరికామాట చెప్పనేల? ఒకభారతనారి భారతీయ దుస్తులలో భారతఋషిప్రోక్తమగు మతము నా దేశములలో బోధించినచో నొక యుత్తుంగతరంగము పైకిలేచి పాశ్చాత్య ప్రపంచమునే ముంచఁగలదని నాదూరదృష్టికిఁదోఁచుచున్నది. మైత్రేయి, లీలావతి, సావిత్రి, ఉభయభారతి మున్నగువారికి జన్మస్థానమైన యీ దేశమున నట్టికార్యమునకుఁ బూనుకొనఁ గల స్త్రీ లభింపదా? ఏమో, భగవంతునికే యెఱుక. ఆధ్యాత్మికశక్తిచే ఇంగ్లండును మనము జయించఁగలము;

స్వాధీనపఱచుకొనఁగలము. "నాన్యః పన్థా విద్యతేఽయనాయ"—ముక్తికి వేఱుమార్గములేదు. సభలు, సమావేశములు జరుపుటచే ముక్తి లభించునా? మన ఆధ్యాత్మికతచే మనజేతలను దేవతలఁ జేయవలయును. ...... ఇంగ్లండు, యూరోపు, అమెరికాల జయించుట—అదియే నేఁడు మనకు దివ్యమంత్రము కావలయును. మనదేశాభ్యున్నతి దీనిపైననే ఆధారపడియున్నది. వ్యాపనమే జీవమునకు నిదర్శనము. మనము మన ఆధ్యాత్మికభావములను ప్రపంచమంతయు వెదఁజల్లవలయును. ఈ కార్యమునకు నేఁను చాలను. కాని నావలనఁగూడ కొద్దికృషి జరిగియుండవచ్చును. భవిష్యత్తున నింకను నెక్కువకృషి జరుగఁగలదను నమ్మకమున్నది.—

"ఉత్పత్స్యతేఽత్ర మమకోపి సమానధర్మా
కాలోహ్యాయం నిరవధి ర్విపులాచ పృథ్వీ॥"

కార్యనిర్వహణమునకై అనంతమగు కాలమున, విపులమగు పృథ్వియందు నాతో సమానధర్మముగల వ్యక్తి పుట్టవచ్చును.

# నేటి మన సాంఘిక సమస్యలు*

స ఈశ అనిర్వచనీయప్రేమస్వరూపః — "అనిర్వచనీయ ప్రేమస్వరూపుఁడగువాఁడాయీశ్వరుఁడు". నారదునిచే భగవంతునికాపాదింపఁబడిన యీగుణము ప్రతిప్రాణిలోనున్నదని, యుండవలయునని నాయభిప్రాయము. అనేకవ్యక్తుల సముదాయమును సమష్టియని, ప్రతివ్యక్తియు వ్యష్టియని యందురు. నీవు నేను, ఒక్కొక్కరువ్యష్టి; సంఘముసమష్టి. నీవు, నేను, జంతువు, పక్షి, క్రిమి, ఈఁగ, చెట్టు, తీఁగ, భూమి, గ్రహము, నక్షత్రము — ఒక్కొక్కటి వ్యష్టి; విశ్వము సమష్టి. ఇదియే వేదాంతమున విరాట్టు, హిరణ్యగర్భుఁడు, ఈశ్వరుఁడు అని, పురాణములలో బ్రహ్మ, విష్ణువు, దేవి అని పిలువఁబడును. వ్యష్టికి వ్యక్తిగత స్వాతంత్ర్యమున్నదా, లేదా; ఉన్నచో దాని పరిమితియెంత? సమష్టి కోసరము వ్యష్టి తనకోరికలను, సంతోషమును సర్వము త్యజింపవలయునా, వలదా—ఇవి యెల్లప్పుడు సంఘము నెదుర్కొనుచున్న సమస్యలు. వీని పరిష్కారమార్గమునకై సంఘము అన్నిచోట్ల ప్రయత్నించుచున్నది. ఈ సమస్య

---

* తే 23-12-1900 ది దేవఘర్ (వైద్యనాథ్) నుండి ఒక వంగ స్త్రీకి వ్రాసినది. వంగమాతృకకు అనువాదము.

లుత్తుంగతరంగములవలె పాశ్చాత్యసంఘమును కల్లోలపఱచు చున్నవి. సంఘాభ్యున్నతికి వ్యక్తి స్వేచ్ఛను త్యాగము చేయుట 'సోషలిజమ్'. వ్యక్తిస్వాతంత్ర్యము ముఖ్యమను సిద్ధాంతము 'ఇండివిజ్యులిజమ్'.

సంఘమునకు వ్యక్తి దాసుఁడై యుండుట, వ్యవస్థకు, నియమములకు వ్యక్తి ఆత్మస్వేచ్ఛ నర్పించుటవలనఁ గలిగిన ఫలితములను ఒక్క మన మాతృభూమియందు మాత్రమే చూడఁగలము. ఈ దేశమున మానవులు శాస్త్రాచారముల ప్రకారము పుట్టుచున్నారు. నిర్ణీతవిధానముననే జీవిత మంతయు వా రన్నపానముల సేవించుచున్నారు. వివాహాది కార్యముల శాస్త్రానుగుణముగఁ జేయుచున్నారు. ఇంతయేల? తుదకు శాస్త్రనియమములప్రకారమే వారు చనిపోవు చున్నారు. కఠినతరమగు నీ నియమపాలనము ఒక్క విష యమునఁ దప్ప పెడత్రోవపట్టినది. ఆ ఒక్క విషయమేమన పెక్కు తరములుగా ప్రతిదినము అలవాటుపడియుండుటచే నెక్కువ ప్రయత్నములేకయే ఒకటి రెండు కార్యముల చేయ గల్గుట. మూఁడు మట్టిముద్దలనుబెట్టి కొద్ది కట్టెలనుపయో గించి రుచ్యమగు నన్నమును, కూరను దయారుచేయు మన దేశవిధానమే దేశమందును లేదు. ఒక రూపాయి విలువ గల సనాతనమగు మగ్గముపై గజము ఇరువదిరూపాయిల విలువగల వస్త్రమును తయారుచేయునేర్పు ఈ దేశముననే

గలదు. ఒకచింపిరిచాప, ఆముదపుదీపము మొదలగు నిట్టి వస్తువులే అసమానమగు గొప్పపండితులను తయారుచేసిన దీ దేశముననే. సహనభావముతో కురూపియగు భార్యతో సంసారయాత్రచేయుట, నిష్ప్రయోజకుఁడు, క్రూరుఁడునగు పతిపై భక్తిగలిగియుండుట యీ దేశమునమాత్రమే సాధ్యమైనది. ఇవన్నియు సత్ఫలితములు.

కాని ఈపనులను ప్రజలు నిర్జీవయంత్రములవలెఁ జేయుచున్నారు. ఇందు తెలివితేటల యుపయోగముగాని, హృదయ నివేదముగాని. జీవనస్పందనముగాని, ఫలాపేక్షగాని, ఉత్సాహశక్తిగాని, సుఖానుభవముగాని, కష్టములయెడ సహనభావముగాని, నిర్మాణశక్తి ప్రమేయముగాని, క్రొత్తఁదనమునెడ నుత్సుకతగాని, నూతనత్వమును మెచ్చుకొను శక్తిగాని లేదు. ఈ మానసికాకాశము ఎల్లప్పుడును మేఘాచ్ఛాదితమే. ఉషఃకాంతిరేఖలు దీనిని కాంతిమంతము చేయలేవు. ఈమేధకింతకంటె నుత్తమస్థితియున్నదను భావమే కలుగదు. ఒకవేళ నట్టి భావము కలిగిన దానియెడ విశ్వాసము కుదురదు. విశ్వాసము కుదిరిన ప్రయత్నలోపముండును. ప్రయత్నమున్నను ఉత్సాహశక్తి లేకుండుటచే నది యణగిపోవును.

పూర్వాచారములు, విధానములు పాటించుటయే ఉన్నతికి మార్గమైనచో, సుగుణమైనచో ఋతువుల ననుస

రించి యాకులరాల్చి, చిగిర్చి, పుష్పించి, ఫలించు చెట్ల కంటెను, పట్టాల వెంబడి పరుగెత్తు ధూమశకటముకంటెను, గుణవంతులు, విధేయులు మఱెవరున్నారు? ప్రకృతి నియమోల్లంఘనము గావించిన శిలనెవరైనను చూచినారా? పశువులు నేరము చేయుట ఎవరికైనను దెలియునా?

పెద్ద పొగయోడ, గొప్ప ధూమశకటయంత్రము— ఇవి జ్ఞానహీనమైనవి. వానికిఁ జలనము గలదు: పరుగెత్తఁ గలవు. కాని జ్ఞానలోపము గలదు. ఒక క్రిమి తన్నుఁ దాను గాపాడుకొనుటకు నినుపపట్టాలకు దూరముగఁ బరువెత్తును. అది ఎందుచేత తెలివిగలది? యంత్రమునకుఁ బ్రయత్నమవసరము లేదు; అది యెప్పుడును నియమోల్లంఘనమునకుఁ బ్రయత్నింపదు. కాని క్రిమి నియమము నెదుర్కొనఁ బ్రయత్నించును. జయాపజయములతో దానికి నిమిత్తము లేదు. అందుచేతనే అది తెలివిగలది. యత్నమెంత గాఢముగానున్న సంతోషమంత యెక్కువగాఁ గలుగును; జీవమంత యుత్తమముగాఁ బరిగణింపఁబడును. భగవంతుని యత్నమెక్కువ ఫలప్రదమైనది. అందుచే నతఁ డుత్తమోత్తముఁడు.

ఏది విద్య? పుస్తకములఁ గంఠస్థముచేసి చిలుక పలుకులు పలుకుటయా? కాదు. విభిన్న విషయపరిజ్ఞానమా?

అదియుఁగాదు. ప్రయత్నమును గలిగించి అదుపులోనుంచి కార్యసాఫల్యమునకు దారితీయు శిక్షణ నియ్యఁగలదియే విద్య. ఎల్లప్పుడు ప్రయత్నమును దనబలముచే నొక్కిపెట్టి స్వేచ్ఛ నరికట్టుచుఁ దుదకు ప్రయత్నమునే లేకుండఁజేసి ప్రాచీనభావములతోఁబాటు నవీనభావములనుసైతము రూపుమాపునది విద్యయేనా? మానవుని యంత్రతుల్యుని గావించుచున్నది విద్యయేనా? ఆలోచింపుము. ఒకరి చెప్పుచేఁతలలో యంత్రము వలె మెలఁగి మంచివాఁడుగ నుండుటకంటె సొంతయత్నముచేఁ దెలివితేఁటలచేఁ జెడుత్రోవఁద్రొక్కుట మేలని నాయుద్దేశము. మంటిముద్దలను, నిర్జీవయంత్రములను బోలిన మనుష్యుల సముదాయమును నిజముగా సంఘమనఁదగునా? అట్టి సంఘమునకుఁ బురోగతి యెక్కడిది? పురోగతియే సాధ్యమైనచో మనము వందలకొలఁదిసంవత్సరములు బానిసజీవనముగడుపక ప్రపంచములోని అన్ని జాతులకంటె గొప్పవారముగ నుండెడివారము. భారతభూమి మూఢవిశ్వాసముల కాలవాలము గాక విజ్ఞానఖనియై యుండెడిది.

ఐనచో నాత్మత్యాగము సుగుణముకాదా? సమష్టి కొఱకు వ్యక్తి సౌఖ్యమును ద్యజించుట మంచిదికాదా? అవును. కాని వంగసామెత అన్నట్లు "రుద్ది కడిగినంత మాత్రాన సౌందర్యము కలుగునా? నిర్బంధముచేతఁ, బ్రయత్నముచేతఁ బ్రేమను గల్గింప సాధ్యమగునా?" భిక్షుకుని

త్యాగమువలన ప్రయోజనమేమున్నది? ఇంద్రియశక్తిలేనివాని ఇంద్రియనిగ్రహమువలన నేమి ఫలమున్నది? ఒక లక్ష్యము, హృదయము, ఉదాత్తాశయము లేనివాఁడు, సంఘమున నేమో నిర్దిష్టాభిప్రాయము లేనివాఁడు ఆత్మత్యాగము చేయుటలో నర్థమున్నదా? స్త్రీని నిర్బంధించి సహగమనము చేయించుటలో నామె పాతివ్రత్య మేమి వెల్లడియగును? మూఢవిశ్వాసముల బోధించి ప్రజలచే సత్కార్యములఁ జేయింప నేల? ప్రజలకు స్వేచ్ఛ నిండు. వారిశృంఖలముల సడలింపుఁడు. అదియే నేను కోరునది. ముఱికిని ముఱికిచేత నే తీసివేయ వీలగునా? బంధమును బంధముచేఁ ద్రెంపఁగలమా? అందుకుదాహరణము లున్నవా? నీసుఖవాంఛను సంఘమునకై త్యాగము చేయఁగలిగిననాఁడు నీవు బుద్ధుఁడవగుదువు; నాఁడే నీకు ముక్తి కలుగును. కాని అట్టి సమయము ఇంకను జేరువలో లేదు. నిర్బంధముచే దానిని సాధింపఁగలమని నీవు భావింతువా? "మన వితంతువులు స్వార్థరాహిత్యమున కెంతటి యుదాహరణములో చూడుఁడు! బాల్యవివాహము లెంత ముచ్చటలో! ఇట్టి యాచార మింకొకటి యుండుటకు వీలగునా! అట్టి వివాహములలో భార్యాభర్తలమధ్య ప్రేమకుఁదప్పఁ దదితర భావములకుఁ జోటుండునా!" — ఇట్టి వ్యంగ్యోక్తులు నేఁడు మనకు వినఁబడుచున్నవి. ఈ పరిస్థితికిఁ గారకులగు మూలపురుషులకు స్వార్థరాహిత్యముతోఁ బనిలేదు, ఇతరులకు సేవచేయుటకు

మించిన సత్కార్యము గలదా? ఈ సూత్రము బ్రాహ్మణులకు వర్తింపదు. ఇతరులు, మీరు చేయవలయును! సత్యమేమన, ఈ దేశమునఁ దలిదండ్రులు, బంధువులు తమ స్వార్థముకొఱకు, సంఘమునఁ బేరుప్రఖ్యాతుల సంపాదించుటకొఱకుఁ, దమ పిల్లలను, నితరులను బలిచేయుచున్నారు. తరతరాల బోధనలచే వారి మేధ కరుడుగట్టుటచే నిట్టి పనిని సులభముగఁ జేయఁగలుగుచున్నారు. ధైర్యవంతుఁడగువాఁడే స్వార్థమును వదలుకొనఁగలఁడు. పిఱికివాఁడగు లోభి కొరడాకు భయపడి ఒకచేతితోఁ గంట నీరు తుడుచుకొనుచు నింకొకచేతితో దానముచేయుచున్నాఁడు. అట్టి దానములచేఁ బ్రయోజనమేమి? విశ్వమును బ్రేమించుట దుర్ఘటమైన కార్యము. మొక్కను నాటి జాగ్రత్తగాఁ బెంచినగదా వృక్షమగును? ఒక్కదానిని ప్రతిఫలాపేక్ష లేక ప్రేమింపఁగలిగినచోఁ గ్రమముగా విశ్వమునే ప్రేమింపవచ్చును. ఏదో ఒక యిష్టదేవతపై భక్తి కుదిరినపుడు విశ్వవిరాట్టుపై భక్తి కుదురుట సాధ్యము కాఁగలదు.

కావున నెవ్వరైనను నొక వ్యక్తికొఱకు స్వార్థమును వదలుకొనఁగలిగినచో నపుడు సంఘమునకై ఆత్మత్యాగము చేయు మాట తలపెట్టవలయును. అంతకుముందు ఆ ప్రస్తావన చేయరాదు. కామకర్మమే నిష్కామకర్మమునకు దారి

తీయును. మొదట కోరికయే లేకున్న కోరికను త్యజింపవలసిన పని యేమున్నది? దాని యర్థమేమి? చీఁకటియే లేకున్న దీపపు ప్రయోజనము మనకుఁ దెలియునా?

ప్రతిఫలాపేక్షతోఁడి, బంధముతోఁడి ఆరాధనము మొదట నుండవలయును. చిన్నవాని నారాధించుటతోఁ ప్రారంభింపవలయును. తరువాత పెద్దవానిఁగూర్చి యాలోచింపవచ్చును.

తల్లీ! తొందరపడకుము. మహావృక్షమును బెనుగాలి అల్లలనాడించును. "నిప్పును విసరినచో బాగుగా మండును." "పాము శిరసుపైఁ జేతితోఁ దాఁకినచోఁ బడగవిప్పి బుస కొట్టును." హృదయమున వేదనగలిగినపుడు, దుఃఖము నలువైపుల నావరించినపుడు, వెలుఁగే కఱవైనపుడు, ఆశ, ధైర్యము లేనపుడు అంతరాత్మలోని బ్రహ్మము ప్రకాశించును. భోగలాలసులై పెరిగి పూపానుపున శయనించుచు, దుఃఖమనున దెఱుఁగని వారెవరైనను గొప్పవారైనారా? వారి ఆత్మలోని బ్రహ్మము ప్రకాశించినదా? దుఃఖము కలిగినదే యని నీ వెందుకు భయపడెదవు? దుఃఖింపుము! ఏడ్పు కన్నులను దేర్చును; ప్రబోధమును కలిగించును. అప్పుడు మనుష్యుఁడు, జంతువు, చెట్టు అను భేదదృష్టి క్రమముగ

నశించి ప్రతిచోట, ప్రతివస్తువునందు బ్రహ్మమును జూడఁ గలవు. అప్పుడు —

> సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్।
> న హినస్త్యాత్మ నాత్మానం సతోయాతి పరాంగతిమ్॥

"సర్వవ్యాపియగు భగవంతుని ప్రతిచోటఁ జూచి ఆత్మను ఆత్మచే బాధింపక మానవుఁడు గమ్యస్థానమును జేరును".

# భారతదేశ క్రమాభివృద్ధి

నాసతి సత్ జాయేత! — అసత్తునుండి సత్తు పుట్టజాలదు...సృష్టికి శూన్యమెప్పుడును గారణము కాఁజాలదు. ఏమియు లేక శూన్యమైన చోటినుండి సృష్టి కలుగఁజాలదు. కార్య కారణవాదము బలీయమైనది. కార్యమున్నచోఁ గారణముండితీరును. కారణమున్నప్పుడు కార్యము తప్పక యుండును. ఈ రెండును లేనపుడు దేశకాలముల కస్తిత్వముండదు. ఈ సిద్ధాంతము ఆర్యజాతివలె నతిప్రాచీనమైనది. ఋషితుల్యులగు ప్రాచీనకవులు దీనిని గానము చేసిరి; వేదాంతులు సప్రమాణముగ సిద్ధాంతీకరించిరి. నేఁటి హిందువు సైతము ఈ సిద్ధాంతమును పునాదిగఁ జేసికొని తన జీవన సౌధమును నిర్మించుకొనుచున్నాఁడు.

జాతిలో మొదట జిజ్ఞాసయుండినది. జిజ్ఞాసవలన సాహసోపేతమైన విమర్శనాత్మకదృష్టి బయలుదేరినది. అనభ్యస్త భావిమహాశిల్పి చేఁతలవలె నప్పటి జాతి సాధించిన కార్యములు చెప్పుకొనఁదగినంతవి కాక పోయినను నా విమర్శాత్మకదృష్టి శాస్త్రీయమగు మహాప్రయత్నములకు దోహద కారియై యత్యద్భుతఫలితములఁ కలుగఁజేసినది.

విమర్శాత్మకదృష్టియే యీ జాతిని ధైర్యముతోఁ బూజావిధానములఁ బరిశీలించునట్లు చేసినది. వేదములలోని ప్రతి పదమును విమర్శించి పూర్వపక్షము చేయునట్లో, ప్రమాణీకరించునట్లో చేసినది. వేదోక్త కర్మలను క్రమబద్ధము చేయునట్లో, సందేహాస్పదములగునట్లో, త్రోసిపుచ్చునట్లో, లేక వివరించునట్లో చేసినది. వారు దేవతల సేవలకులాగి సర్వశక్తిమంతుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వవ్యాపి అగు నీ సృష్టికర్తకు—స్వర్గములోని తమ తండ్రివంటి వానికి—ద్వితీయస్థానముమాత్ర మిచ్చునట్లు చేసినది. లేదా అతని ప్రమేయమే లేని సర్వసమ్మతమగు నిరీశ్వరమతమును ప్రతిపాదించునట్లు చేసినది. ఈ మతమునే నేఁ డెక్కువమంది పాటించుచున్నారు. వివిధ దేవాలయ నిర్మాణమున నిటుకలఁ బేర్చుట రేఖాగణితశాస్త్రవృద్ధికి దారితీసినది. కాలకృత్యములు తీర్చుట, పూజలు చేయుట మున్నగునవి నిర్ణీత కాలమునఁ జేయు ప్రయత్నముచే వృద్ధికివచ్చిన జ్యోతిశ్శాస్త్ర విజ్ఞానము ప్రపంచమున కాశ్చర్యజనకమైనది. ఆ విమర్శనాత్మకదృష్టియే ప్రాచీనాధునిక జాతులలో నే జాతికి సాధ్యము కానంత పరిశోధనమును గణితశాస్త్రమున నార్యజాతిచేఁ జేయించినది. రసాయనిక శాస్త్రము, వైద్యశాస్త్రము, మొదలగువానిలో వారికిఁగల విజ్ఞానము, వారి సంగీతస్వరకల్పనము, వారి యస్త్రశస్త్ర ప్రయోగనైపుణ్యము, నేఁటి ఐరోపీయ నాగరికతా

సౌధమునకు గట్టి పునాదులైనవి. అదియే విజ్ఞానదాయకము లగు పిట్టకథలచే పిల్లలకు మనోవికాసమును గల్పించు శాస్త్రము పుట్టుటకుఁ గారణమైనది. అట్టి కథలను నాగరిక దేశములలోని ప్రతి బాలుఁడును శిశురక్షణ కేంద్రమందో, పాఠశాలయందో నేర్చుకొని జీవితము నర్థముచేసికొను చున్నాఁడు.

ఈ నిశిత విమర్శనాత్మకదృష్టిని గప్పుచు నత్యద్భుత మగు కవితాదృష్టికూడ నీ జాతి కుండెను. ఆజాతి మతము, వేదాంతము, చరిత్ర, నైతికశాస్త్రములు, రాజకీయాది విషయములు అన్నియు భావప్రధానమగు కవితయందే యణఁగినవి. అత్యద్భుతమగు సంస్కృతభాషాశక్తి అన్ని భాషలకంటెను భావప్రకటనమున కెక్కువ తోడ్పడినది. గణితశాస్త్రమందలి కఠిన విషయములను సైతము మధుర ములగు సంఖ్యావాచక శబ్దము లాహ్లాదకరము గావించినవి.

ఈ విమర్శనాత్మకశక్తి, దానిని బహిర్గతమొనర్చిన కవితా దృక్పథము — ఈ రెండును హైందవజాతికి నస్తిత్వ మును గూర్చిన ఆంతరకారణములు. ఈ రెండును హైందవ జాతి ధర్మమునకు బునాదులైనవి. ఈ రెంటి సమ్మేళన మింద్రియాతీతములగు వానిని అందుకొనునట్లు చేయుటయే గాక హైందవజాతిచే దుర్భేద్యములగు వానిని సయితము భేదించునట్లు చేసినది.

వీరు కవిత్వమునఁ దేనెసోనలు గురియించిరి. వీరి యాభరణముల సొగసులు, పాలరాతియందలి మిలమిలలు, రంగులకూర్పులోని సంగీతము, ఊఁదిన పాఱువలిపములు వాస్తవిక జగత్తుకంటె స్వప్నజగత్తుకు సంబంధించినవన వచ్చును. ఈ సౌందర్యపిపాస ఈ రూపకల్పనము ఒక దినములో వారి కబ్బినదికాదు. కొన్ని వేలయేండ్ల కృషిచే వా రట్టిస్థితికి రాఁగలిగిరి. ఇంద్రియ గమ్యమగుదానికి నతీంద్రియవాసన, సత్యము లసత్యములేమో యను భ్రమ కలిగించు కవితాశక్తికి శాస్త్రములు, కళలేగాక గార్హస్థ్య జీవితములోని వాస్తవిక విషయములు సైతము లోనైనవి.

మనకు లభ్యములగు ప్రమాణములనుబట్టి యతి ప్రాచీనకాలముననే కవితాశక్తి యేదోయొక ప్రయోజనమును సాధించు సాధనమై యీజాతి చేతులలోనుండెనని మనకుఁ దెలియుచున్నది. ఈ జాతి మత సంఘము లనేక వికారములకు లోనై తుదకు వేదములలో వర్ణింపఁబడిన స్థితికి వచ్చియుండును.

నిర్ణీతమగు కొన్ని దైవములు, విపులమగు పూజావిధానము, వృత్తులనుబట్టి సంఘవిభజనము, పెక్కు జీవితావసరములు, భోగములు, నింకను ననేకములు వేదకాలముననుండెను.

భారతీయ వాతావరణ ప్రభావ మప్పటికీ జాతిపై లేదని యధునాతనపండితు లనేకు లేకగ్రీవముగఁ జెప్పుచున్నారు.

పెక్కు శతాబ్దముల తరువాత విశాలమైదానములకు, దుర్గమారణ్యములకు, మహానదులకు నిలయమై శీతల హిమాలయములకు నుష్ణ దక్షిణ భూమికి మధ్యనున్న ప్రదేశ మావాసముగఁగల ప్రజానీకము మనకుఁగన్పట్టును. ద్రావిడులు, టార్టారులు, ఆదిమజాతివారు మొదలగు విభిన్న జాతులవారు వివిధభాషలు, ఆచారవ్యవహారములు, మతములతో విరాజిల్లుచుఁ, దమపాత్రను దాము నిర్వహించుచుండినట్లుకూడ మనకుఁ దెలియును. ఈ జాతుల కలయికతో నొక గొప్ప జాతి వెలువడినది. ఇట్లేర్పడిన మహాజాతిలో నార్యస్వభావము వ్యక్తమగుచునే యుండినది ; ఆజాతి ఎక్కువ శక్తిమంతమై విశాలదృక్పథము, సువ్యవస్థ కలిగి యుండినది.

ఈ మహాజాతి సగర్వముగా ఆర్యనామముంచుకొని తన స్వభావగుణముల నందఱకుఁ బ్రదానము చేసినది. ఈ జాతి తన నాగరకతను, తల్లాభములను నితరజాతులు పొందుటకు సమ్మతించినను వారినిఁ దమలోఁ గలుపుకొని తమతోఁ బాటు ఆర్యులుగా వ్యవహరింపఁబడుట కిష్టపడలేదు.

భారత దేశ నైసర్గిక స్థితి యాజాతి తెలివి తేటల వృద్ధికిఁ దోడ్పడినది. ప్రకృతి అనుకూలముగ నుండి సులభ విజయమును జేకూర్చిన యీ దేశమున మానవుని మేధ ప్రకృతికి సన్నిహితమై జీవితమునుగూర్చిన గొప్పసమస్యలను బరిష్కరించినది. సహజముగ వేదాంతి-బ్రాహ్మణుఁడు-హైందవసంఘమున నగ్రస్థానము నలంకరించెను. కత్తికంటె కలమే ప్రాధాన్యము వహించెను. చరిత్ర ప్రారంభదశయందే బ్రాహ్మణులు తమ శక్తినంతయు ధారవోసి కర్మకాండమును విస్తృతముచేసిరి. కర్మకాండ పెరిగిపోయి జాతికిఁ దలకు మించిన బరువైనపుడు తార్కికదృష్టితో వానినిఁ బరిశీలించుట ప్రారంభమైనది. ఈ కర్మకాండను మొదట త్రోసిరాజన్నవారు రాజులే.

సంఘమునకుఁ దమ్మావసరమగునట్లుచేసి సంఘమునఁ దమ కగ్రస్థానమిచ్చిన ఆ మతము నొకవైపు బ్రాహ్మణులనేకులు సమర్థించుచుండ నింకొకవైపు జాతిభద్రత బాధ్యతలు వహించుచు నలౌకికవిషయములందును దాము మార్గదర్శకులుగానున్నట్లు భావించిన క్షత్రియులు కర్మకాండనిర్వాహణము మాత్రము తెలిసినవారి కగ్రస్థానమిచ్చుట కంగీకరింపరైరి. బ్రాహ్మణ క్షత్రియ కులములనుండి వేఱుపడిన యింకొక తెగవారు కలరు. వీరు కర్మకాండ ముఖ్యమను బ్రాహ్మణులను, వానినిఁ దార్కికదృష్టితోఁ జూచు వైజ్ఞానికులను సమానముగ విమర్శించి, ఆధ్యాత్మికత, బ్రాహ్మణ్యము

అంతయు మిథ్య యని యైహికభోగముల పొందు మార్గ మన్వేషించుటయే జీవితపరమలక్ష్యమని వాకొనిరి. కర్మకాండముతో, తార్కికులవాదముతో విసుగెత్తిన ప్రజలు పెక్కురీ భౌతికవాదులలో చేరిరి. భారతదేశమున వర్ణవ్యవస్థను గూర్చిన వాదమునకు, కర్మకాండమునకు, తర్కమునకు, భౌతికవాదమునకు మధ్య జరుగుచున్న పోరాటమునకు నాంది యిదియే. వీనికి నేఁటివఱకును బరిష్కారమార్గ మేర్పడనే లేదు.

ఈ కష్టమునుండి బయటపడుటకు సమదృష్టితోఁ బరిశీలించుటకుఁ బ్రయత్నించుట మొదటి పరిష్కారమార్గము. ఈ సమదృష్టి అతిప్రాచీనకాలమునుండియు విభిన్నత్వములో విభిన్నరూపములలోనున్న ఏకసత్యమునుజూచు మార్గమును ప్రజలకుఁ జూపినది. దీని స్థాపకుఁడు క్షత్రియుఁడగు శ్రీకృష్ణుఁడే. గీతయందలి అతని వాక్కులు జైనులు, బౌద్ధులు మొదలగువారిచే నేర్పడిన కల్లోలపరిస్థితులలోఁ బెక్కు ఒడుదుడుకులకు లోనై చివరకు భారతదేశ వ్యాఖ్యానముగా, నిజమైన జీవితసిద్ధాంతముగా స్థిరపడిపోయినవి. ఘర్షణ తాత్కాలికముగ కొంత ఉపశమించినను ఆ ఘర్షణకు కొంత వఱకు కారణములైన సాంఘికసమస్యలు — రాజులు వర్ణ వ్యవస్థలోఁ దమకగ్రస్థానముండవలయుననుట, బ్రాహ్మణులకుఁ గల అవకాశములయెడ సామాన్యప్రజలలో రేకెత్తిన

అసంతృప్తివంటివి — భగవద్గీతచేఁ బరిష్కారము పొందలేదు. స్త్రీపురుషభేదము, వర్ణభేదము లేకుండ నందఱు ఆధ్యాత్మ జ్ఞానమును, ఆత్మసిద్ధినిబొందు మార్గమును కృష్ణుఁడు సూచించెను. కాని సంఘ సమస్య నట్లే యుంచెను. సాంఘికసమానత్వమును సాధించుటకు బౌద్ధులు, వైష్ణవులు మొదలగువారు మహాప్రయత్నములు చేసినప్పటికి ఆ సమస్య నేఁటివఱకు నట్లే యున్నది.

నేఁటి భారతదేశము ఆధ్యాత్మరంగమున నందఱి సమానదృష్టితోఁ జూచినను సాంఘికముగ విభేదమును బాటించుచునే యున్నది.

ఈ సంఘపోరాటము తిరిగి క్రీ. పూ. ఏడవశతాబ్దమందును దరువాత శాక్యమునియగు బుద్ధుని నాయకత్వమున నాఱవశతాబ్దమందును రేకెత్తినట్లు మనకుఁ దెలియుచున్నది. బ్రాహ్మణులకు, మతగురువులకుఁ గల అవకాశము త్రోసిపుచ్చుటలో బౌద్ధులు ప్రతి వేదకర్మను నిరాకరించి వేదప్రతిపాదితములగు దేవతలను బౌద్ధసన్న్యాసుల సేవకస్థానమునకు దించి మూలవిరాట్టును బ్రాహ్మణకల్పితముగా, మూఢనమ్మకముగాఁ బేర్కొనిరి.

జంతుబలి యవసరమగు యజ్ఞయాగాదికర్మలను, వంశపారంపర్యమగు కులమును, బ్రాహ్మణులకుఁగల ప్రాధా

న్యమును, ఆత్మలు శాశ్వతములైనవను విశ్వాసమును బ్రోసి రాజని వైదికమతమును సంస్కరించుటయే బౌద్ధమతప్రధాన లక్ష్యముగా నుండినది. వైదికమతమును నిర్మూలించుటకుఁ గాని, సాంఘికవ్యవస్థను దారుమారుచేయుటకుఁగాని ఆ మత మెప్పుడును బ్రయత్నింపలేదు. ఈ మతము చైతన్యవంత మైన ఒక నూతనవ్యవస్థ ననుసరించి సన్న్యాసులు సౌభ్రాత్ర ముతో విహారజీవితము నడుపునట్లును, బ్రహ్మవాదినులు బ్రహ్మచారిణీసంఘముగ నేర్పడునట్లును జేసినది.

శతాబ్దములకొలఁది భారతప్రజానీకములోఁ జాలమంది సంస్కరణాభిలాషులై సంస్కర్తల కండయై నిలిచిరనవచ్చును. ప్రాచీనశక్తు లుపశమింపకపోయినను బౌద్ధమతప్రాబల్యము కలిగిన యీ శతాబ్దములలో కొన్ని దిద్దుబాట్లకు లోనైనవి.

ప్రాచీన భారతదేశమున ప్రజలు మానసికాధ్యాత్మిక చైతన్యముగలవారై యుండిరి కాని రాజకీయచైతన్యము వారిలో లేదు. నేఁడువలెఁ బ్రాచీనకాలమునందును రాజకీయ సాంఘికశక్తులు మానసికాధ్యాత్మికశక్తుల కనుబంధములై యుండెను. సన్న్యాసుల ఆశ్రమములు, ఆధ్యాత్మబోధకుల కుటీరములు, జాతీయజీవన కేంద్రములై యుండెను. ఇట్లు పాంచాలమునందును, వారణాసియందును, మిథిలయందును సమితులు వెలసి అధ్యాత్మసంస్కారమునకు, వేదాంతమునకు కేంద్రములై యుండినటుల ఉపనిషత్తులవలనఁగూడఁ దెలియు

చున్నది. ఈ కేంద్రము లార్యనాయకులదృష్టి నాకర్షించుటచే వారిలో నొక్కొక్కరు వీనిపై నధికారము చేపట్టుటకుఁ బ్రయత్నించిరి.

కురు పాంచాలులు రాజ్యకాంక్షచే యుద్ధమునకు దిగి నాశనమైనట్లు మహాభారతము చెప్పుచున్నది. తూర్పున మాగధులో లేక మైథిలులో ఆధ్యాత్మరంగమునఁ బ్రాబల్యము వహించుచు వచ్చిరి. కురు పాంచాల యుద్ధము తరువాత నా ప్రాబల్య మొక్క మాగధులకే దక్కినది.

బౌద్ధమతవ్యాపకమునకుఁ, కార్యాచరణమునకుఁగూడఁ బ్రాచ్యభాగమే రంగమైనది. తరువాత మౌర్యరాజులు యుద్ధమునెడ వారికిఁగలిగిన విముఖభావముచేఁ గాబోలు బౌద్ధమును స్వీకరించి క్రొత్త యుద్యమమునకు నాయకత్వము వహించుటచే బౌద్ధమత ప్రచారకులు పాటలీపుత్త్రచక్రవర్తులకు మత విషయమున బాసటయైరి. బౌద్ధమతమునకుఁగల బహుళ ప్రజాదరణ, క్రొత్తశక్తి మౌర్య చక్రవర్తుల భారతదేశ చరిత్రలో నసమానులఁ జేసినది. మౌర్యచక్రవర్తుల యధికారము బౌద్ధమతమును ప్రపంచవ్యాప్తము చేసినది.

వైదికమతము సర్వసామాన్యము కాకపోవుటచే నితరులసాహాయ్యము లభ్యముకాకపోయినది. అందుచే బౌద్ధ

మతమువలె విమతశక్తులకు లోఁబడి వ్యక్తిత్వమునుగోల్పోక నిష్కల్మషముగ వాని కతీతముగ నిలువఁబడినది.

బహుళ ప్రచారమే లక్ష్యముగాఁ గల బౌద్ధమతము విమత సాంప్రదాయములకుఁ దావిచ్చుచువచ్చుటచే నది క్రమముగాఁ దన వ్యక్తిత్వమును గోల్పోయినది. అంతియే కాక ప్రజామతముగాఁ జెలామణి కావలయునను కోరికచే అది బౌద్ధమతములోని బుద్ధి గమ్యములగు ననేకములకు స్థానము నీకపోవుటచేఁ గొద్దిశతాబ్దములలోనే దానికి దూరమైనది. ఇంతలో వైదికమతానుయాయులు తమమతములో ప్రతిఘటనాస్పదములగు జంతుబలివంటివానిని జాలవఱకుఁ దీసివేసి తమకు ప్రతిస్పర్థియైన బౌద్ధమతములోని మంచివానిని గ్రహించి విగ్రహస్థాపనము, పూజలు మొదలగువాని నతి జాగ్రత్తతో నవివాద పద్ధతిలోఁ జేయుచు భారతదేశమున నప్పటికిఁ గొనయూపిరితోఁ బతనావస్థలోనున్న బౌద్ధమత స్థానము నాక్రమించినది.

ఇంతలో సిథియనులు దండయాత్ర చేయుటచేఁ బాటలీపుత్రసామ్రాజ్యము సర్వనాశనమై బౌద్ధమతము నామరూపములు లేక పోయినది.

దండయాత్ర చేసిన సిథియనులు తమ మాతృభూమి యగు మధ్యాసియా ప్రాంతము బౌద్ధమత ప్రాబల్యమునకు

లోనగుటచే నిచ్చటి బ్రాహ్మణుల సూర్యారాధనమును జూచి తమమతముతోఁ బోలికలున్నవని గ్రహించి ఆ బ్రాహ్మణులు తమ యాచారవ్యవహారముల పరిగ్రహించి వాని కాధ్యాత్మవాసన నిచ్చుటకు సిద్ధముగనుండ తమసర్వస్వమును బ్రాహ్మణమతరక్షణకై ధారవోయుటకు ప్రయత్నించిరి.

తరువాతి చరిత్ర అంధకార భరితము. అందు శీఘ్ర వికారములకులోనైన ఛాయలు, యుద్ధఘోషలు, హత్యలు ఎన్నో తలయెత్తినవి. ఈ చీఁకటి తరువాత నంతయు నూతనమే. ఒక క్రొత్త రంగము మనకుఁ గన్పట్టును.

మగధ సామ్రాజ్యము సమసిపోయినది. ఉత్తర హిందుస్థానము చాలవఱకు పరస్పరము యుద్ధము చేయుచుండు చిన్నరాజుల చేతులలోనికి వచ్చినది. ప్రాచ్య, హిమాలయ ప్రాంత రాష్ట్రములు, దక్షిణప్రదేశములందు తప్ప మిగిలిన దేశమున బౌద్ధమత మంతరించినది. ప్రజలు శతాబ్దముల తరబడి పరంపరగవచ్చు మతబోధకులకు స్వస్తిచెప్పుటకు పోరాడగా నిప్పుడు రెండు విధములగు మతబోధకుల చేతిలో వడకత్తెరలోని పోకచెక్కవలె చిక్కుకొనిరి. ఒకవైపు పరంపరగా వచ్చు బ్రాహ్మణులు, నింకొకవైపు విరాగులగు సన్న్యాసులు బౌద్ధమతవ్యవస్థను బోలిన వ్యవస్థ నేర్పఱిచి

యధికారము చెలాయింపసాగిరి. కాని ఈ వ్యవస్థలో బౌద్ధ మతమునందువలె ప్రజలయెడ సానుభూతి లేకపోయినది.

ప్రాచీన శిథిలావశేషములనుండి సాహసులగు రాజపుత్రుల ధైర్యసాహసములచే, రక్తదానముచే సంపాదితము, విజ్ఞానకేంద్రమని చరిత్ర ప్రసిద్ధిగాంచిన మిథిల బ్రాహ్మణులచే భావితము, శంకరాచార్యులు, తదనుయాయులచే స్థాపింపబడిన నూతన మతానుసరితము, మాళవరాజాస్థానములందలి లలితకళలచే భూషితమునగు క్రొత్త భారతదేశము క్రొత్తశక్తితో నవతరించినది.

ఈ క్రొత్త భారతదేశకర్తవ్య మపారము. దీని సమస్యలు ప్రాచీను లెదుర్కొన్నవానికంటె నెక్కువ. రక్తస్పర్శయందును, భాషయందును, సాంఘికమత దృక్పథమునందును నొకేతీఱుగా నుండి తమచుట్టును దుర్భేద్యములగు నవధుల నిర్మించుకొని తమ ప్రత్యేకతను నిలుపుకొనదలచిన యొక్క చిన్న జాతి బౌద్ధమతము ప్రాబల్యము వహించిన కాలమున చేర్పుమార్పులచే పెద్దదియై జాతి, రంగు, భాష, సాంఘికమత దృక్పథములందు భిన్నమై పెక్కు తెగలైనది. ఇప్పుడు వీనినన్నిటిని నేకముచేసి బృహజ్జాతిగా రూపొందించు నవసర మేర్పడినది. బౌద్ధమతమునకు గూడ నీ సమస్యను పరిష్కరింపవలసివచ్చినది. కాని అప్పు డీ సమస్యకు విస్తృతి తక్కువగా నుండెను.

ఇన్ని దినములును ఆర్యులలో గలిసిపోవుట కుబలాట పడుచుండిన యితరులను కలుపుకొని ఆర్యసంఘమును విస్తృత మొనర్చుటయే సమస్యగానుండినది. బౌద్ధమతము పరిస్థితులనుబట్టి కొన్ని మార్పులకు లోనైనను నిరాఘాట ముగ వ్యాప్తిచెంది భారతదేశ మతముగా నిలిచినది. జాతి వివక్షతలేక యందఱిలో నింద్రియ గమ్యమగు విగ్రహారాధ నము ప్రబలి ఆర్యజాతి పునాదులే కదలిపోవు నపాయస్థితి యేర్పడినది. అది యింకను ప్రబలియుండినచో నార్యనాగ రికతను సమూలచ్ఛేదము చేసియుండెడిది. అట్టి సమయమున నాత్మరక్షణకు ఉద్యమము బయలుదేరినది. తత్ఫలితముగ జన్మభూమియగు భారతదేశముననే చాలభాగములందు బౌద్ధ మతమునకు నిలువనీడ లేకపోయినది.

ఉత్తరమున కుమారిలభట్టుచేతను, దక్షిణమున శంకర రామానుజులచేతను గొంత ముందు వెనుకలుగా బయలు దేరిన విప్లవాత్మకోద్యమమువలన వివిధములగు తెగలు, సిద్ధాంతములు, కర్మకలాపములు మిళితమై హిందూమత ముగాఁ దుదిరూపమును దాల్చినది. సుమారు వేయియేండ్ల నుండి వీనిని సమ్మేళనముచేయుట కష్టతరముగానుండి సంస్కారావసరముకూడ నేర్పడినది. ఇప్పుడు బయలుదేరిన యీ యుద్యమము వైదికకర్మలను పునరుద్ధరించుటకు ప్రయ త్నించి విఫలమై ఉపనిషత్కర్మాచరణమునకుఁబూనుకొన్నది.

వ్యాస మీమాంసకు, భగవద్గీతకు ప్రాధాన్యమేర్పడినది. తరువాతి యుద్యమకర్తలు నీ మార్గమే యనుసరించిరి. శంకరాచార్యుల యుద్యమము ప్రజ్ఞాబంధురమై సాధారణ భావములకు స్థానమీయక వర్ణవ్యవస్థను పాటించుచు సంస్కృతభాషకు ప్రాముఖ్యమిచ్చుటచే సామాన్య ప్రజానీక మున కందుబాటులో లేకపోయినది. కాని రామానుజాచార్యు లనుసరించిన మార్గ మనుభవసాధ్యమై హృదయము నుత్తేజ పఱచు భావప్రధానమగు సందేశమునుగలిగి యాసందేశ మును ప్రజాభాషలో నందఁజేయుచు, నధ్యాత్మసిద్ధిలేని జన్మ హక్కును నిరాకరించుటచే ప్రజలను వైదికమతమునకుఁ ద్రిప్పుటలో విజయవంతమైనది.

ఉత్తర హిందూస్థానమున నీ విప్లవము బయలుదేరిన వెంటనే మహామాళవసామ్రాజ్యము స్థాపితమైనది. ఈ సామ్రాజ్యము కొద్దికాలముననే పతనమైనంతనే ఉత్తర దేశము చాలకాలము సుషుప్త్యవస్థయందుండి తరువాత నాఘనుస్థానపుఁ గనుమలగుండా వచ్చిన బలవంతమగు మహమ్మదీయ దండయాత్రికులచే జాగృతముగావింపఁబడినది. దక్షిణదేశమున మాత్రము శంకర రామానుజులు కర్తలై నిల్చిన మతోద్యమము హైందవచక్రవర్తులయొక్కయు, సామంతులు, నాయకులయొక్కయు నాదరముచే సాగుచునే వచ్చినది. ఉత్తర హిందూస్థానమంతయు మధ్యాసియా

విజేతల పాదాక్రాంతమైనప్పుడు హిందూమతమునకు, నాగరకతకు దక్షిణ హిందూదేశ మాశ్రయమైనది. మహమ్మదీయులు దక్షిణదేశమును జయించుటకు కొన్ని శతాబ్దములు పోరాడిరి. కాని వారచ్చట స్థిరముగా కాలూదినారని చెప్పఁజాలము. మొగలులొకప్పుడు చాలవఱకు జయించు నవకాశముండినది కాని అప్పుడు అచ్చటి ప్రజలు వేలకొలఁది ముందునకువచ్చి తమ మతరక్షణకై అసువుల నిచ్చుటకు సిద్ధపడిరి. తరువాత కొలదికాలమునకు మొగలుసామ్రాజ్యమే నామమాత్రావశిష్టమైనది.

మహమ్మదీయ యుగమున నుత్తర హిందూస్థానమున బయలుదేరిన యుద్యమముల కన్నింటికి పాలకుల మతములో ప్రజలు కలిసిపోకుండునట్లు చేయు నేకలక్ష్యము ప్రధానమైనది. తత్ఫలితముగ నందఱకు సాంఘికాధ్యాత్మికరంగములలో సమానహక్కు గలిగినది.

రామానంద, కబీరు, దాదు, చైతన్యుఁడు, నానకు మొదలగువారికి సిద్ధాంతములలో నేకీభావము లేకపోయినను మానవులందరు సమానులే యని వారేకగ్రీవముగఁ జాటిరి. వారు తమ శక్తినంతయు ప్రజలలో నిస్లామ్ మతము వ్యాప్తినందకుండుటకే ధారవోయవలసివచ్చుటచే క్రొత్త ఉద్దేశ్యములను, భావములను వారు ప్రతిపాదించలేకపోయిరి. ఇస్లామ్

మతమును ప్రతిఘటించి ప్రజలను వైదికమతముననే నిలుపుటలో వీరు కృతార్థులైరనవచ్చును.

ఉత్తరదేశమున బయలుదేరిన యుద్యమకర్తలలో సిక్కుల అంతిమగురువగు గోవిందసింగు నిర్మాణశక్తిగల గొప్ప మతప్రవక్త. ఇతని బోధనల ఫలితముగ పటిష్ఠమగు సిక్కు రాజకీయవ్యవస్థ యేర్పడి చరిత్రఖ్యాతి నందినది. ఇట్లు భారతదేశచరిత్రను గమనించినచో ప్రతి అధ్యాత్మ విజృంభణము ఫలితముగ నొక రాజకీయవ్యవస్థ యేర్పడి దాని కండగా నిలిచినట్లు తెలియును. మహారాష్ట్ర, సిక్కు రాజ్య స్థాపనకు ముందేర్పడిన యధ్యాత్మవిజృంభణములు కేవలము విప్లవాత్మకమైనవి. అందుచే మాళవ, విద్యానగరముల నటుంచి తుదకు మొఘలు ఆస్థానమందుండిన ప్రజ్ఞాపాటవములు కూడ పూనా, లాహోరులలో లేనట్లు మనకు విదితమగును. ఈ దృష్టిలో నీయుగము భారతదేశచరిత్రలో నత్యంతఅంధకారబంధురమైనది. స్వమతాభిమానము, పరమతద్వేషమే లక్ష్యమైన ఈ సామ్రాజ్యములు ప్రతిస్పర్ధియగు మహమ్మదీయరాజ్యము నాశనమైనంతనే లక్ష్యవిహీనములైనవి.

తరువాతి చరిత్ర కల్లోలములకు నాకరమైనది. శత్రులు, మిత్రులు, మొఘలుసామ్రాజ్యము, దానిని నాశము

చేసినవారు, ఇంతవఱకు ప్రశాంతముగ వర్తకముసాగించుచుండిన ఫ్రెంచివారు, ఆంగ్లేయులు—అందఱును యుద్ధరంగమున దుమికిరి. సుమారు అర్ధశతాబ్దమునకు పైగా నెచ్చట చూచినను యుద్ధములే. హత్యలే; దోపిడులే. యుద్ధమేఘములు విచ్చుసరికి ఆంగ్లేయ విజయపతాక భారతదేశముపై నెగురుచుండినది. ఏఁబదియేండ్లుగా బ్రిటను కట్టుదిట్టములతో, ప్రశాంతముగా భారతదేశమును పాలించుచున్నది. ఈ పరిపాలనా విధానము అభివృద్ధిసాధకమో, నిరోధకమో చూడవలసియున్నది.

ఢిల్లీ చక్రవర్తుల పాలనకాలమున నొత్తరాహులచేఁ బైకివచ్చిన మతోద్యమములవంటివే యాంగ్లేయులకాలమునను రేకెత్తినవి. ఈయుద్యమములు అఘాయిత్యములకులోనై జీవితాశతో చావుబ్రతుకులమధ్యనున్న ప్రజల స్పష్టాస్పష్ట కంఠారావములు. ప్రజలు తమపొట్టకొఱకు పాలకుల అభిరుచుల కనుగుణముగ మతసాంఘికాచారముల మార్చుకొనుచుండిరి. విశేషించి ఆంగ్లప్రాబల్యమునకులోనైన సమాజములలో పాలకవర్గ సంఘాచారములు పెక్కు పాతుకొన్నవి. ఈ శతాబ్దిలో బయలుదేరిన సమాజములకు గంగిరెద్దులవలె ఆంగ్లేయు లేదిచెప్పిన దానికి తలయూచుట యలవాటైనది. ఈసమాజములకు నిర్ణీతమగు జీవితవిధానము లేకపోయినది. అధిక హిందూప్రజానీకము మతవిషయమునమాత్రము స్వతం

త్రముగా పాలకులకు దూరముగనిలిచిరి. అందుచే నీ క్రొత్త సమాజములు నశించినప్పుడు వారత్యుత్సాహము కనుబఱచుట తప్ప వాని నాదరింపరైరి.

బహుశః ఇంకను గొద్దికాల మీా పరిస్థితులలో మార్పు రాదేమో!

# పురోగమనము*

నిన్నటి దినము స్త్రీల కారాగారాధికారిణి యిచ్చటికి వచ్చియుండినది. ఇచ్చట వానిని కారాగారములనరు ; నేరస్థుల శిక్షణశాలలందురు. అమెరికాలోని విశేషములలో నిది యత్యద్భుతమైనది. ఇందలివారి నెంత దయార్ద్రహృదయముతో చూతురనుకొన్నావు! వారెంత సంస్కారము గలవారై సంఘమున కుపయోగపడువారుగ తయారగుచున్నారనుకొన్నావు! ఈ విషయము కన్నులార చూచిన గాని నీ కర్థముకాదు; నమ్మకముగలుగదు. నేను వీరిని చూచినపుడు హిందూదేశమున మనము బీదవారిని, తక్కువ తరగతులవారిని ఎట్లు చూతుమో ఆవిషయము తలంపునకువచ్చి నా మనస్సెంతో బాధపడినది. వారు పైకిరాగల అవకాశము గాని, మార్గముకాని లేనేలేదు. భారతదేశములోని బీదవాఁడు, తక్కువతరగతివాఁడు, నేరస్థుఁడు—వీరికి స్నేహితులు లేరు; సాహాయ్యములేదు; ఎంత ప్రయత్నించినను బాగుపడు మార్గములేదు. దినదినమునకు వారిపరిస్థితి మఱింత యధ్వాన్నమగుచున్నది. దయావిహీనమగు సంఘము అడుగడుగు

* 30-8-1893 న అమెరికానుండి వ్రాసిన యుత్తరమునుండి ఉద్ధృతము.

నకు వారిపై దెబ్బతీయుచునే యుండును. కాని, పాపము, వారికా దెబ్బ యెచ్చటినుండివచ్చి తమ్ముతాఁకుచున్నదో తెలియదు. తాముకూడ మానవులమేయను మాటనే వారు మఱచిపోయియున్నారు. తత్ఫలితము - హానిపతనము. ఇటీవల కొందఱు మేధావంతు లీ పరిస్థితిని గమనించినారు. కాని దురదృష్టవశాత్తు వారు హిందూమతమే అట్టిపరిస్థితికిఁ గారణమైనదని ప్రపంచములో నుత్కృష్టమగు నామతము నణఁగఁద్రొక్కుటయే తరణోపాయమని చెప్పినారు. కాని, సోదరా! నామాట వినుము. భగవంతునిదయచే రహస్యమును నేను గనుగొంటిని. ఆ దోషమునకు మత మెంతమాత్రమును గారణముగాదు. ప్రతిజీవి నీవంటిదని, అందలి యాత్మ నీయాత్మ ప్రతిబింబమే అని నీ మతము బోధించుచున్నది. ఇఁక నా బోధను ఆచరణలో పెట్టనందువల్లను, సానుభూతి లేకపోవుట చేతను నాదోషమేర్పడినది. భగవంతుఁడే బుద్ధావతారమెత్తి వచ్చి బీదలయెడ, కష్టదశలో నున్నవారియెడ, నేరస్థునియెడ నెట్లు సానుభూతి చూపవలయునో, భూతదయ యవసరమెట్టిదో మీకు బోధించినాడు. కాని అతనిమాటలను మీరు వినలేదు. భగవంతుడు తన విపరీతసిద్ధాంతములలో రాక్షసులకు భ్రమగొల్పుట కట్టి యవతారముతో వచ్చెనని మీ మతకర్త లొక కథను గల్పించిరి. అతని సూత్రముల నమ్మిన వారు రాక్షసులుకారు. ఆ మాటల విశ్వసింపని మనమే

నిజముగ రాక్షసులము. ఏసుక్రీస్తును కాదని నాటినుండి యిల్లువాకిలిలేక యెల్లరి నిరసనకు పాత్రులై తిరుగుచున్న యూదులవలె మనపై నధికారము చెలాయింపదలచిన ప్రతి జాతికి మనము దాసోహమ్మనగలము. క్రౌర్యముతోడి యధికారము, బానిసతనము — ఈ రెండును నొక్కచోటనే యుండునని నీకు తెలియదు. బానిస, క్రూరాధికారి సమానార్థముగలపదములే....బౌద్ధమతము బోధించిన భూతదయతోపాటు హిందూమత ప్రతిపాదితములగు గొప్ప ధర్మములను బాటించుచు నీ విషమపరిస్థితినుండి బయటపడవలయునే గాని మతమును నిర్మూలించుటతో నిది సాధ్యముగాదు.

ఉత్సాహపూరితులు, భగవంతునిపై నచంచల విశ్వాసముగలవారు, సింహవిక్రములు, భూతదయాపరులు నగు స్త్రీపురుషులు లక్షలకొలఁది ముక్తిమార్గమును, ఆత్మజ్ఞానమును, సంఘ పునరుద్ధరణమును, సర్వసమానత్వమును గూర్చి ప్రచారముచేయుచు దేశము నలుమూలలు తిరుగవలయును.

ప్రాణికోటిలో మానవుని శ్రేష్ఠత్వమునుగూర్చి హిందూమతము చాటినంతగా నే యితరమతముగాని చాటలేదు. హిందూమతమునవలె బీదబక్కలపై సవారిచేయు మతము కూడ లేదు. మత మనర్థకారి కాదను నుద్దేశ్యమును భగ

వంతుఁడు నాకు గలిగించినాఁడు. పారమార్థిక, వ్యావహారిక సిద్ధాంతములపేర హిందూమతమునెడ మూఢ విశ్వాసము గలవారు సృష్టించిన విపరీతవాదములే అనర్థకారులు.

నిరుత్సాహపడకుము. గీతావాక్యముల జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. 'కర్మణ్యేవాధికరస్తేనా మాఫలేషు కదాచన' కర్మమందు తప్ప కర్మఫలముపై నీకధికారములేదు. కర్మాచరణమున కాయత్తుఁడవుకమ్ము. నాకు భగవంతుని యాజ్ఞ యిదియే. జీవితమంతయు నవాంతరములకు, హింసలకు లోనగుట నేను చూచినాను; ఆఁకలిచే నా ప్రియులు, సన్నిహితులు మరణించుట చూచినాను. నన్ను దూషణతిరస్కారములుచేసినవారిపై నేను సానుభూతి చూపినందుకు నే నెన్నో కష్టములపాలైతిని; ఎన్ని విమర్శలకో గుఱియైతిని; నమ్మకద్రోహిగా పరిగణింపఁబడితిని. భారతదేశమే దుఃఖాత్మకమగు పాఠశాలవంటిది. ఆపాఠశాలయందే సానుభూతి, సహనము, ఆకాశము విఱిగి మీఁదపడినను వదలని గట్టిప్రయత్నముగల మహాత్ములు, గొప్ప వ్యాఖ్యాతలు తయారైరి. వారికి సంఘములో నున్నతస్థానమున్నను వారింకను బాల్యదశయందే యున్నారు. వారి దృష్టి చాలపరిమితము. కూపస్థమండూకములవలె తమదృష్టిపథమునఁ బడినదే ప్రపంచమని భావించి కొన్నిగజముల కావల నేమిజరుగుచున్నదో వారు గమనింపరు. తఱితప్పక నిత్యకర్మలను – అన్నపానీయములు

గ్రహించుట, ద్రవ్యమును ఆర్జించుట మొదలగువానిని — చేయుటయే వారు కర్తవ్యముగా నెంతురు. వారి యీనిద్రావస్థ కెప్పుడును భంగము కలుగలేదు. శతాబ్దముల దాస్య ఫలితముగా ప్రజలలో గలిగిన దుఃఖము, బాధ, పతనము, పేదఱికము - ఇవేవియు జీవితమునుగూర్చి వారు కనుచున్న సుఖస్వప్నముల కంతరాయము కలిగింపలేదు. యుగయుగాలుగ శారీరక, మానసిక, నైతిక సంయమనమునకు గుఱియైనందున భగవంతుని ప్రతిమ భారవాహకజంతువుగ, దేవీ విగ్రహము పిల్లల పోషించుదాదిగ, జీవితము శాపఫలముగ పరిగణించుస్థితికి వచ్చినదని వారు గమనింపలేదు. కాని సానుభూతిపరులు, దయార్ద్రమనస్కులునగు సహృదయులుగూడ లేకపోలేదు. వీరు ఈ పరిస్థితికి నివారణోపాయమున్నదని భావించి యందుకై ఆత్మత్యాగముచేయుటకు సిద్ధముగ నుండిరి. కాని వారెప్పుడును దూరదృష్టితో నుదాత్తవిషయములనే యాలోచించుచు తమ దోషములనుండి విముక్తులగుటకు సిద్ధముగ నున్న సామాన్యప్రజలగూర్చి యాలోచించుటకు వీలులేకపోయినది. ఇది సహజమేకదా!

జీవన్మృతులవంటివారగు ధనికుల విశ్వసించి ప్రయోజనము లేదు. నీవంటి సామాన్యులు, విశ్వాసపాత్రులునగు వారియందే భవిష్యత్తు ఆధారపడియున్నది. భగవంతునిపై నమ్మక ముండవలయును. అదియున్నచో నే సిద్ధాంతమును

నవసరము లేదు. కష్టదశలోనున్న వారియెడ సానుభూతికలిగి సాహాయ్య మపేక్షింపుము. అప్పుడు తప్పక లభించును. ఈ హృదయభారముతో, నీ యుద్దేశ్యముతో పండ్రెండేండ్లు నేను ప్రచారము చేసితిని. ధనికులు, గొప్పవారునని చెప్పబడు నొక్కొక్కని నాశ్రయించితిని. నిరాశాహతుఁడనై సగము ప్రపంచమును దాఁటి సాహాయ్యముకొఱకై నేల నడుగిడితిని. భగవంతుఁడుదారహృదయుఁడు. అతఁడు నాకు తప్పక సాయ పడును. నే నిచ్చట చలిచేతను, నాకలిచేతను మరణింప వచ్చును. కాని నీవంటి యువకులు బీదలు, నజ్ఞానులు, నస్వ తంత్రులు నగువారియెడ నిట్టి సానుభూతియే చూపవలయు నని, వారికై యీ విధముగనే పోరాడవలయునని నా కోరిక. గోకులమందలి గోపాలురకు, బీదలకుస్నేహితుఁడైనవాఁడును, నస్పృశ్యుఁడగు గుహకుని కౌగిలించి యాదరించుటకు వెను దీయనివాఁడును, బుద్ధావతారమున రాజుల యాహ్వానములఁ ద్రోసిపుచ్చి యొకవేశ్య ననుగ్రహించి యామెను గాపాడిన వాఁడునునగు పార్థసారథిసన్నిధికి మీరు తత్క్షణము పొందుడు. ఆ భగవంతుఁ డెట్టి దీనులకాపాడుట కప్పుడప్పు డవతార మెత్తుచుండెనో యాదీనుల కొఱకు మీ యావజ్జీవితము నర్పించుటకు కంకణము కట్టుకొనుఁడు. నానాఁటికి పతనమగు చున్న ముప్పదికోట్ల ప్రజల పునరుద్ధరించుటకు శపథము పూనుఁడు.

ఈ పనియూ ఒక్క దినములో పూర్తియగునదికాదు. మార్గమూ కంటకావృతమైనది. కాని పార్థసారథి తప్పక మీసారథి కాగలడు. అతనిపైని విశ్వాసముతో, నతని పేరుతో కొన్ని యుగములుగా భారతభూమిని రాశీభూతమై యున్న దుఃఖమును దగ్ధముచేయుఁడు. అది అసాధ్యమైనపని గాదు. కార్యము పెద్దది కావచ్చును. మన మల్పులము గావచ్చును. కాని మనము సర్వరక్షకుఁడగు భగవంతుని బిడ్డలమనుమాట మఱవకుఁడు. అతని యనుగ్రహముచే మనము తప్పక కృతార్థులము గాఁగలము. ఈ కార్యనిర్వహణ ములో వందలకొలఁది మనుష్యులు తమ అసువులఁ బాయ వచ్చును. తరువాత వందలకొలది ఆ కార్యము నిర్వహించు టకు సిద్ధముగ నున్నారు. నే నిక్కడ విఫలుఁడనై మరణింప వచ్చును. కాని మఱియొకఁ డీ కార్యము నిర్వర్తింపగలఁడు. దోషమేదో, తన్నివారణోపాయమేదో నీకు తెలియును. ఇఁక కావలసినది భగవంతునిపై నమ్మకమే. ధనికులపై, గొప్పవారిపై నాశయుంచుకొనకుము. వారివలన నీ కెట్టి సాయమును లభింపదు. మేధావంతులగు గ్రంథకారుల విషయముగూడ నంతే. వీరిలో హృదయములేదు. నిరవధిక మగు విశ్వాసము, సానుభూతి — ఇవియే యావశ్యకములు. ఇవి యున్నచో చావుబ్రదుకులు, నాకలిదప్పులు లెక్కలోనికి రావు. మన మేమి సాధించినను ఫలానుభవము భగవంతు

నిదే. అతఁడే మన సారథి. ఈ పురోగతిసాధనలో నెవరు మరణింతురో, ఎవరు వెనుకపడుదురో వెనుదిరిగిచూడకుము. ఏలన, పురోగమనమే మనలక్ష్యము. ఇట్లు చేసిననే మనము పురోగమింపగలము. ఒకఁడు పడిపోవునుగాక, మఱియొకఁడతని కార్యభారము వహింపఁగలఁడు.

ఓం తత్ సత్

సంపూర్ణము.



